# తెలంగాణ తల్లి ఎరుక

(తెలంగాణ చరిత్ర, సంస్కృతి, సామాజిక పరిణామాలు)

**బి.ఎస్.రాములు**

సంపాదకులు :
గూడూరి సీతారాం
సిహెచ్.వి. ప్రభాకరరావు

ప్రచురణ:
విశాల సాహిత్య అకాడమి
సామాజిక తాత్విక విశ్వవిద్యాలయం

# తెలంగాణ మాతృభాషా పరిరక్షణ సమితి

తెలంగాణా తల్లిని స్మరించండి.
తెలంగాణ తల్లికి నమస్కరించండి.
తెలంగాణా తల్లి చరిత్రను పునర్నిర్మించండి.
'తెలంగాణా తల్లి' విగ్రహాలను ఆవిష్కరించండి.
తెలంగాణా తల్లి అని నినదించండి.
తెలంగాణా తల్లి గీతాలు రాయండి.
తెలంగాణా తల్లి గీతాలు పాడండి.

'తెలుగు మీడియం' చదువులు మాకొద్దు.
'తెలంగాణా మీడియం' చదువులు కావాలి.
'తెలంగాణా ఈడియం' కావాలి.
తెలంగాణా మీడియంలో,
తెలంగాణా ఈడియంలో
పాఠ్యపుస్తకాలు రాయాలి.
ఇంటిభాషంటే తెలంగాణ పేదింటి భాషే.

తెలంగాణ భాష పోతే అన్నీ పోయినట్టే.
తెలంగాణ జాతిగా అంతరించినట్టే.
తెలంగాణా జాతిగా సుస్థిరంగా ఎదగండి.
తెలంగాణా జాతి చరిత్రను నినదించండి.
మెసపొటేమియా, సుమేరియా నాగరికత నుండి
మధ్య ఆసియా దాకా చరిత్ర నిర్మించిన జాతి
తెలంగాణ జాతి

తెలంగాణ మాతృభాషా పరిరక్షణ సమితి
శాఖలను ఊరూరా ఏర్పాటు చేయండి.

తెలంగాణ జనాభా (2001)

| జిల్లా | విస్తీర్ణం (చ.కి.మీ లలో) | జన సాంద్రత | మండలాల సంఖ్య | గ్రామాల సంఖ్య | పట్టణాల సంఖ్య | మొత్తం జనాభా | షెడ్యూల్డ్ కులాలు | షెడ్యూల్డ్ కులాల శాతం | షెడ్యూల్డ్ తెగలు | షెడ్యూల్డ్ తెగల శాతం | వ్యవసాయ దారులు | వ్యవసాయ కూలీలు | గృహ పరిశ్రమ పనివారు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అదిలాబాద్ | 16,105 | 154 | 52 | 1729 | 15 | 2,488,003 | 461,214 | 18.54 | 416,511 | 16.74 | 30.38 | 30.58 | 8.87 |
| నిజామాబాద్ | 7,956 | 295 | 36 | 918 | 3 | 2,345,685 | 348,158 | 14.84 | 165,735 | 7.07 | 27.25 | 29.72 | 14.29 |
| కరీంనగర్ | 11,823 | 295 | 56 | 1,092 | 7 | 3,491,822 | 650,246 | 18.62 | 90,636 | 2.60 | 25.26 | 33.41 | 12.64 |
| మెదక్ | 9,700 | 275 | 45 | 1243 | 11 | 2,670,097 | 469,492 | 17.58 | 134,533 | 5.04 | 30.16 | 37.54 | 4.38 |
| హైదరాబాద్ | 217 | 17,649 | 16 | - | 3 | 3,829,753 | 307,248 | 8.02 | 34,560 | 0.90 | 1.04 | 0.62 | 2.97 |
| రంగారెడ్డి | 7,493 | 477 | 37 | 923 | 17 | 3,575,064 | 520,045 | 14.55 | 146,057 | 4.09 | 19.64 | 20.84 | 2.87 |
| మహబూబ్ నగర్ | 18,432 | 191 | 64 | 1550 | 7 | 3,513,934 | 600,972 | 17.10 | 278,702 | 7.93 | 30.43 | 42.75 | 3.89 |
| నల్గొండ | 14,240 | 228 | 59 | 1148 | 9 | 3,247,982 | 575,788 | 17.73 | 342,676 | 10.55 | 25.49 | 42.09 | 4.42 |
| వరంగల్ | 12,846 | 253 | 51 | 1071 | 2 | 3,246,004 | 551,385 | 16.99 | 457,679 | 14.10 | 29.38 | 39.69 | 4.99 |
| ఖమ్మం | 16,029 | 161 | 46 | 1229 | 9 | 2,578,927 | 424,692 | 16.55 | 682,617 | 26.47 | 22.91 | 49.19 | 2.15 |
| మొత్తం | **1,14,841** | | **462** | **10,903** | **83** | **30,987,271** | **4,909,240** | | **2,749,706** | | | | |

భారత ప్రభుత్వ జనాభా గణాంక వివరాల నుండి

# తెలంగాణ తల్లి ఎరుక

**చరిత్రను నిరంతరం కొత్తగా తిరగరాయాలి :**

చరిత్రను ఎవరికి అనుకూలమైనట్లు వారు నిర్మించుకుంటారు. సాధారణంగా చరిత్ర అంతా గెలిచినవారి గురించి ఉండే అవకాశముంటుంది. గెలవదలచుకున్నవారు తిరిగి చరిత్రను కొత్తగా అధ్యయనం చేస్తుంటారు. ప్రతి తరం ఎప్పటికప్పుడు చరిత్రను పునర్నిర్మించుకోవాల్సి వుంటుంది. గతానికి వర్తమానానికి నిరంతర సంభాషణే చరిత్ర అని ఇ.హెచ్.కార్ అంటాడు. వర్తమాన అవసరాలలో భాగంగా భవిష్యత్ ప్రణాళికలకు అనుగుణంగా గత చరిత్రలో అంతదాకా అప్రధానంగా ఉండిపోయిన వాస్తవాలు చారిత్రక వాస్తవాలుగా, చారిత్రక సత్యాలుగా కొత్త శక్తితో ముందుకు వస్తాయి. చరిత్రపై కొత్త వెలుగు ప్రసరిస్తుంది. చరిత్ర అంటే కేవలం చారిత్రక వాస్తవాలు కాదని, చారిత్రక వాస్తవాలను వ్యాఖ్యానించడమే చరిత్ర రచన చేస్తున్న పని అని చరిత్రకారులు స్పష్టం చేశారు. అందువల్ల చరిత్ర చదివేముందు ఆ చరిత్రను రాసిన చరిత్రకారుల దృక్పథాన్ని, జీవితాన్ని పుట్టిపెరిగిన కాలాన్ని పరిమితులను తెలుసుకోవడం అవసరమని చరిత్రకారులు స్పష్టం చేశారు.

**చారిత్రక భౌతికవాదం, ఫెమినిజం దృష్టిలో చరిత్ర :**

అందువల్ల చరిత్రను నిరంతరం తిరిగి కొత్తగా రాయడం, తిరిగి కొత్తగా తెలుసుకోవడం జరుగుతున్నది. చరిత్రని తిరిగి కొత్తగా వ్యాఖ్యానించడంలో భాగంగా గతితార్కికులు గతితార్కిక చారిత్రక భౌతికవాదాన్ని రూపొందించారు. ఈ దృష్టితో భారతదేశంలో డి.డి.కోశాంబి ప్రాచీన భారతదేశ చరిత్రను పునరధ్యయనం చేశారు. ఫెమినిస్టులు, అంబేద్కరైట్లు చారిత్రక భౌతికవాదం పరిమితులను అసమగ్రతను ముందుకుతెచ్చి చరిత్రను మరికొన్ని కోణాల్లో మనముందుకు తెచ్చారు. ఎంతచేసినా, ఎందరు ఎన్నిరకాలుగా నిర్వచించినా ఆయా పార్శ్వాలు మాత్రమే వెలుగు చూస్తాయి. దానికి సమగ్రత ఎన్నడూ రాకపోవచ్చు.

**జాతీయోద్యమకాలంలో చారిత్రక దృష్టి :**

ఇలాగే తెలంగాణ ప్రాంత చరిత్రను మళ్ళీ మళ్ళీ అధ్యయనం చేయడం, వీలైనన్ని కొత్తకోణాలు ఆవిష్కరించడం అవసరం. ప్రాంతాలవారీగా, కులాలవారీగా నిలువుగా, అడ్డంగా చరిత్రను పునర్నిర్మించుకోవాల్సివుంది. 1910కి ముందు ఈ ప్రాంతం ఎలా ఉంది. మన తాతలకాలంలో ఎలావుంది. మన ముత్తాతల కాలంలో ఎలా వుంది. అపుడు ప్రపంచం ఎలా వుంది. మనమెలా వున్నాం. పాలన ఎలా వుంది.

రవాణా పద్ధతులు ఎలా వున్నాయి. మొదలైనవి సవివరంగా పరిశీలించుకొంటూ పోతే చరిత్ర ఘట్టాలు మనముందు సాక్ష్యం ఇస్తాయి. జాతీయోద్యమ కాలంలో కె.పి.జైస్వాల్ యూరోప్ సామ్రాజ్యవాదుల ఆధిపత్యాన్ని వ్యతిరేకిస్తూ భారతదేశ చరిత్రలో సువర్ణాధ్యాయాలున్నాయని జాతికి ఒక స్ఫూర్తిని అందించారు.

జాతికి జాతీయోద్యమానికి స్ఫూర్తిని ఇవ్వడానికి ఒక అబద్ధాన్ని అయినా సృష్టించి దాన్ని ఒక సాధించే ఆశయంగా ముందుకు నడిపించు అని ఒక తత్వవేత్త అంటారు. కానీ మహోన్నత గతంగల తెలంగాణ చరిత్ర ఇందుకు భిన్నంగా మరుగు పరచబడింది. అసత్యాలు సత్యాలుగా చరిత్ర వక్రీకరించబడింది.

**1910 నుండి వక్రీకరించిన నైజాం రాజ్య చరిత్ర :**

1910 నుండి తెలంగాణ, నైజాం రాజ్యం గురించి రాయబడిన చరిత్రనంతా ప్రశ్నించవలసినదే. తిరిగి కొత్తగా తిరగరాసుకోవలసినదే. 1910 నాటి వరకు ప్రపంచంలో దక్కను పీఠభూమి నిర్వహించిన చారిత్రక పాత్ర భారత ఉపఖండంలో యూరోపు ఆధిపత్యం పెరగడానికి, యూరోపు సింహాసనం నిలువడానికి దోహదంచేసిన టిప్పుసుల్తాన్, నిజాం, మరాఠా రాజుల మధ్య, రాజ్యాలమధ్య కొనసాగిన శత్రుత్వాలు ఎలా కారణమయ్యాయో సరోజని రేగాని రాసిన "నిజాం-బ్రిటీష్ సంబంధాలు" సిద్ధాంత గ్రంథం స్పష్టంచేస్తుంది. నిజాం రాజ్యం ఆసరాతోనే మరో వందేళ్ళు బ్రిటీష్ సామ్రాజ్యం భారతదేశంలో కొనసాగడం ఎలా సాధ్యపడిందో సరోజని రేగాని గ్రంథం సరైన సాక్ష్యాధారాలతోసహా నిర్ధారించింది. ఆ యుద్ధాల ఖర్చు కింద 1768లో కోస్తాంధ్ర తీర ప్రాంతాన్ని, 1798లో రాయలసీమ ప్రాంతాన్ని నిజాం రాజు బ్రిటీషువాళ్ళకి దత్తం చేశాడు. మద్రాసు రాష్ట్రంలో తెలుగువాళ్ళు పలు కష్టాలు, అవమానాలు అనుభవించారు. తెలుగు భాషకు గౌరవం లేకుండా పోయింది. ఆంధ్రులు మద్రాసీలుగా పిలువబడ్డారు. రెండవశ్రేణి పౌరులుగా చూడబడ్డారు. వారి విజ్ఞప్తులతో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని 1921లో కాంగ్రెస్ ఒక తీర్మానం చేసింది. 1953లో కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది.

నైజాం అన్నది బ్రిటీష్‌వారు పూర్తిగా లొంగదీసుకోలేకపోయిన ఒక స్వతంత్ర రాజ్యం, దేశం. మొఘల్‌లతో సహా భారత ఉపఖండం బ్రిటీష్‌వారికి దాసోహం అయిన రోజుల్లో బ్రిటీష్‌వారిని నిలువరించి వారు సంధికి వచ్చి స్నేహహస్తం చాచేలా చేసిన దేశం ఇది. పాలకులు ముస్లింలే కావచ్చు, అది వేరే విషయం. చరిత్రకారులు "నైజాం దేశాన్ని ఎప్పుడూ దేశంగా పేర్కొనలేదు. ఎందుకని? నైజాంను విలాస పురుషుడుగా పరిపాలన తెలియని నియంతగా ఎందుకు వర్ణిస్తారు? నైజాం రాజ్యంలో పరిపాలన తెలిసిన అధికారులు ఎందరో ఉండేవారు. ఇదొక స్వతంత్ర దేశంగా యూరోపియన్ దేశాల్లో తన రాయబారులను నియమించుకున్న దేశం. స్వతంత్రం వచ్చేనాటికి "రాజ్యపాలన తెలిసినవారు యావత్ భారత ఉపఖండంలో నైజాం దేశంలోనే ఉన్నారు. పాకిస్థాన్ ఏర్పడడంతో వారు పాకిస్థాన్ వెళ్ళిపోయారు లేదా ప్రాధాన్యత లేక మిన్నకుండి పోయారు. ఆనాటి రోడ్లు, వంతెనలు, కట్టడాలు, చెరువులు,



నీటి పారుదల సౌకర్యాలు అన్నీ పరిపాలన దక్షతను స్పష్టం చేస్తాయి.

**15°-10° నుండి 20°-40° ఉత్తర అక్షాంశాల మధ్య 74°-40° నుండి 81°-35° తూర్పు రేఖాంశాల మధ్య వున్న హైదరాబాద్ రాష్ట్రం దక్కన్ పీఠభూమి మధ్య భాగంలో బహుముఖంగా విస్తరించి వుంది. దాని వైశాల్యం 82,168 చదరపు మైళ్ళు, 1,86,55,108. అనగా కి.మీ.కు సగటున ఇద్దరు మాత్రమే జనాభా అంత విస్తారమైన రాజ్యం ఇది. తూర్పు నుంచి పడమర వరకు 456 మైళ్ళు.**

**కాంగ్రెస్ పార్టీ నిర్మించిన చరిత్ర :**

1910 తరువాత నుండి బ్రిటీషాంధ్ర నైజాం రాజ్య భారతీయ సంస్థానాలు, బ్రిటిష్ సామ్రాజ్యం భారతదేశంలో కొనసాగిన ప్రాంతాల గురించిన చరిత్ర ప్రధానంగా కాంగ్రెస్ జాతీయోద్యమంలో భాగంగా రెండూ పర్యాయ పదాలు అనుకునేట్టుగా రాయడం జరిగింది. కాంగ్రెస్ జాతీయోద్యమ చరిత్ర భారతదేశ చరిత్రగా పాఠ్య పుస్తకాలకు ఎక్కింది. అందువల్ల మిగతా చరిత్ర మరుగున పడిపోయింది. కాంగ్రెస్‌కు సమాంతరంగా సాగిన రాజకీయ ఉద్యమాలు సంఘసంస్కరణ ఉద్యమాలు, కులచైతన్య ఉద్యమాలు, జాతీయోద్యమాలు ఇంకా చాలా - చరిత్ర వెలుపలే ఉండిపోయాయి. వాటన్నిటిని వెలికితీసుకురావడంలో భాగంగా మహాత్మా జ్యోతిబా ఫూలే, నారాయణగురు, తుర్రె భాజ్‌ఖాన్, పెరియార్ రామస్వామి, భాగ్యరెడ్డి వర్మ, వి.ఎస్.వెంకటరావు, కుసుమ ధర్మన్న, మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, సత్యశోధక సమాజ ఉద్యమం, ఆది హిందూ ఉద్యమం, బ్రాహ్మణ, ముస్లిం, వైశ్య, రెడ్డి, కమ్మ, పద్మశాలి, గౌడ, విశ్వబ్రాహ్మణ, కులసంఘాల ఉద్యమాలు మొదలైనవన్నీ కొత్త నినాదాలతో, ఆలోచనతో ముందుకు వస్తున్నాయి.

**తెలంగాణ చరిత్ర పలు దృక్పథాలు :**

తెలంగాణ చరిత్ర విషయానికి వస్తే, నిజాం రాజ్యం విషయానికి వస్తే, దక్కను పీఠభూమిలో భాగంగా వేల ఏళ్ళ చరిత్రను మరింత లోతుగా అధ్యయనం చేయడం అవసరం. ఇప్పటిదాకా ఈ చరిత్రను మూడు కోణాల్లో ముందుకు తీసుకురావడం జరిగింది. ఒకటి - కాంగ్రెస్ పార్టీ తనకు అనుకూలంగా తన పరిమితులతో రాయించిన చరిత్ర. రెండు - కమ్యూనిస్ట్ పార్టీలు నక్సలైట్లు తమ పోరాటాలకనువుగా తమ బ్రిటీషాంధ్ర వలసాధిపత్యానికి అనువుగా పోరాటాల చరిత్ర పేరిట, చారిత్రక భౌతికవాదం పేరిట అందిస్తున్న చరిత్ర. మూడు - బ్రిటీషాంధ్ర ప్రాంతవాసుల ఆధిపత్యంలో 1956 నవంబరు 1వ తేదీ నుండి ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డ తర్వాత వారి ఆధిపత్యానికి అనువుగా తెలంగాణ ప్రాంత చరిత్రను తక్కువచేసి, హీనంగా చూసి వారి భాషలో, యాసలో సత్యాలు మరుగుపరిచి పాఠ్యపుస్తకాలద్వారా అందిస్తున్న చరిత్ర. ఇలాంటి తప్పు చరిత్రలే ప్రస్తుతం అందుబాటులో ఉన్నాయి. ఇవి అన్నీ కూడా తెలంగాణ జాతి ఆత్మగౌరవం గాలికి వదిలేసి తమ ఆధిపత్యాన్ని తెలంగాణ జాతిమీద నెలకొల్పడానికి ఉద్దేశించినవే. తద్వారా గత 50 ఏళ్ళుగా తెలంగాణ

భారతదేశంలోని ప్రస్తుత రాష్ట్రాల జనాభా, వైశాల్యంతో నేటి తెలంగాణాను పోల్చిచూద్దాం :

| రాష్ట్రం | విస్తీర్ణం (చ.కిమీ) | జనాభా (1991 లెక్కలు) | జనసాంద్రత (ప్రతి చ.కి.మీ.) |
|---|---|---|---|
| తెలంగాణ | 11,47,000 | 2,60,89,074 | 227 |
| అరుణాచల్‌ప్రదేశ్ | 84,000 | 8,64,858 | 10 |
| అస్సాం | 78,000 | 2,24,14,322 | 286 |
| గోవా | 4,000 | 11,69,793 | 316 |
| హర్యానా | 44,000 | 1,64,63,648 | 372 |
| హిమాచల్‌ప్రదేశ్ | 56,000 | 51,70,877 | 93 |
| మణిపూర్ | 22,000 | 17,74,778 | 79 |
| మిజోరమ్ | 21,000 | 6,89,756 | 33 |
| నాగాలాండ్ | 17,000 | 17,09,546 | 73 |
| పంజాబ్ | 50,000 | 2,02,81,969 | 403 |
| సిక్కిమ్ | 7,000 | 4,06,457 | 57 |
| త్రిపుర | 10,000 | 27,57,205 | 263 |
| జమ్మూకాశ్మీర్ | | | |
| కేరళ | 39,000 | 2,90,98,518 | 749 |
| పశ్చిమబెంగాల్ | 89,000 | 6,80,77,965 | 776 |

(తల్లడిల్లుతున్న తెలంగాణ, పేజీ నెం. 200)

అలాగే ఉత్తరాఖండ్, జార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్ చిన్నరాష్ట్రాలు ఇటీవల ఏర్పడ్డాయి. ప్రస్తుతం తెలంగాణ ప్రజల ప్రపంచ జనాభా సుమారు 5 కోట్లకు చేరింది. తెలంగాణ జనాభా మూడు కోట్లకు పైబడింది. ఇది 1956లో ఆంధ్రప్రదేశ్ మొత్తం జనాభా కన్నా ఎక్కువ.

**తెలంగాణ జాతి చరిత్ర :**

శతాబ్దాల చరిత్రను వెలికితీసి తెలంగాణ జాతి తన చరిత్రను తాను తెలంగాణ జాతి ఆత్మగౌరవంతో దక్కను పీఠభూమి చరిత్రతో సమన్వయించుకుంటూ భారతదేశంతోపాటు నైజాంరాజ్యం ఒకదేశంగా, ఒక జాతిగా తన చరిత్రను సగర్వంగా ముందుకు తీసుకురావల్సిన అవసరం ఉంది. దాని చారిత్రక ఆవశ్యకతను గుర్తింపజేయడానికి ఇది ఒక ప్రయత్నం.

**శాలివాహన శకాన్ని అందించిన ప్రాంతం :**

ప్రపంచ చరిత్రలో దక్కను పీఠభూమి ఒక ప్రసిద్ధ ప్రాంతం. ప్రాక్ చరిత్రకాలం నుండి ఇక్కడ చారిత్రక ఆనవాళ్ళు బయల్పడ్డాయి. రాక్షసబల్లి అవశేషాలతో పాటు నాగరికత ఆరంభానికి ముందున్న రాతి, లోహ యుగం అన్నిదశల మానవుల ఉనికిని తెలిపే చారిత్రక సాక్ష్యాలు తెలంగాణలో లభ్యమయ్యాయి. ప్రాచీన ప్రపంచ నాగరికతల్లో దక్కను పీఠభూమి నాగరికత ఒకటి. ఇది క్రీస్తుపూర్వం నాలుగవ శతాబ్దం నుండి క్రీ.శ. రెండవ శతాబ్దం దాకా భారతదేశాన్ని పరిపాలించే రాజవంశాలను అందించింది. ప్రపంచానికి శాలివాహన శకాన్ని అందించింది. ప్రపంచ కథాసాహిత్యానికి మూలకందమైన బృహత్కథ, గాధాసప్తశతి మొదలైనవి దక్కను పీఠభూమి అందించిన రత్నరాసులే. ఇలాంటివన్నీ వెలికితీసి ఒక జాతి చరిత్రగా సమగ్రంగా రూపొందించడానికి భారత చరిత్ర కాంగ్రెస్ ఆధ్వర్యంలో తెలంగాణ చరిత్రకారులు ఒక వారంరోజులపాటు హిస్టరీ కాంగ్రెస్‌ను తెలంగాణ చరిత్రపై నిర్వహించడం నేటి చారిత్రక కర్తవ్యం. ప్రస్తుతం లభ్యమైన చారిత్రక అంశాలు కూడా చారిత్రక అంశాలు కూడా ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉన్నాయి. అందువల్ల తెలంగాణ ప్రజలు తమ చరిత్రను తాము తిరిగి కొత్తగా రాసుకోవాలి. తిరిగి కొత్తగా తెలుసుకోవాలి. కాంగ్రెస్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, కమ్యూనిస్టులు, నక్సలైట్లు రూపొందించిన చరిత్రలన్నింటిని ప్రశ్నించాలి. లేనిపక్షంలో ఆత్మగౌరవం కోల్పోయిన జాతి చరిత్రను నిర్మించలేదు. చరిత్రకు నాయకత్వం వహించలేదు.

**శాతవాహన సామ్రాజ్య కేంద్రంగా దక్కను పీఠభూమి :**

శాతవాహనుల కాలం నుంచి తెలంగాణ రాజ్యం మగధ సామ్రాజ్యం లాగే చరిత్రలో ఒక గొప్ప ముద్ర వేసింది. తెలంగాణ భాషాసంస్కృతి నాలుగున్నర వేలేళ్ల పైబడినది. దీని చరిత్ర వ్యాప్తి, పరిణామ క్రమంలో గ్రీకు, రోమ్, చైనా, మెసపోటేమియా, సుమారు, హిబ్రూ, జెరూసలెం, ఈజిప్టు వంటి పలు ప్రాంతాలకు, దేశాలకు, భాషలకు విస్తరించింది.

చదవగా చదవగా పదేళ్ళక్రితం నాకు కొన్ని ఆలోచనలు తట్టాయి. తెలంగాణకు మెసపటోమియా - సుమేరియన్ నాగరికతకు సంబంధాలున్నాయని. ఈ విషయమై చాలా నోట్సు రాశాను. ఆ ఆలోచనను మరింత ముందుకు తీసుకవెళ్తూ సాక్ష్యాధారాల్తో సహా మిత్రుడు సంగనభట్ల నర్సయ్య ఒక వ్యాసం రాశాడు.

ఇటీవల మెసపటోమియా, సుమేరియన్ సంస్కృతికి తెలంగాణ మాతృభూమి అని సాక్ష్యాధారాలతో నిర్ధారిస్తూ మిసిమి మాసపత్రిక జనవరి-2005 సంచికలో అతని వ్యాసం ప్రచురితమైంది. సుమేరియన్ నాగరికతలో పేర్కొన్న తెలివాహ నది గోదావరినదియేనని, సుమేరియన్ సంస్కృతికి జనకులైన తెలిమనులు తెలినదీ తీరవాసులైన తెలంగాణ ప్రాంతీయులేనని నిర్ధారిస్తూ అందులో చక్కటి విశ్లేషణ చేశారు.నేటి ఇరాన్, ఇరాక్ దేశ ప్రాంతాలలోను, మెసపటోమియాలో క్రీ.పూ. 2000



సం॥లో నివసించిన సుమేరియన్లు మట్టిపలకలపై రాసిన రాతలను డీకోడ్ చేశారు. ఈ సుమేరియన్లు తమ తెలిమన్ (గోదావరి) ల్యాండ్ నుండి వెళ్ళి సుమేరియన్‌లో స్థిరపడి తమ పూర్వీకులతో సంబంధ బాంధవ్యాలు, వ్యాపారాలు కలిగి వుండేవారు. భారతదేశం, మెసపటోమియాలమధ్య వ్యాపార సంబంధాలు క్రీ.పూ. 3వ సహస్రాబ్ది నుంచి ఉన్నాయని ప్రొ॥ జేమ్స్ ఎడ్గార్ స్వీన్ అన్నారు. అవి గోదావరి దక్షిణతీర ప్రాంతాలే. సుమేరియన్లు తెలంగాణ ప్రాంతంనుండి వలస వెళ్లినవారే అనడానికి ప్రాచీన శిలా సమాధులు సాక్ష్యం. ఇరాక్‌లోని కిర్కుక్ పట్టణంలోని సమాధులు మెదక్ (మంజీరకా దేశంగా బౌద్ధ వాఙ్మయం పేర్కొన్న ప్రాంతం) లోని మర్కుక్ ప్రాంతంలో పురవాస్తు శాఖవారు జరిపిన త్రవ్వకాలలో బయటపడ్డ సమాధులు (మెగాలిథిక్‌లు) ఒకే జాతీయులు ఏర్పాటు చేసికొన్న సమాధులే.

> **శెరవనీయ బౌద్ధ జాతకకథ తెలివాహ నదిని గురించి పేర్కొంది. అది ఆంధ్రపురం ఒడ్డున ఉన్నదని చెప్పింది. తెలివాహ నది గోదావరి నదియే. తెల్లని నీరుగల నదిగా తెలివాహ పేరు ఉండేది. తెలివాహ నది ఒడ్డున కోటిలింగాల శాతవాహన రాజధాని ఉండేది. శాతవాహనుల కన్నా పూర్వం పాలించిన సామగోపుని మహాతలవర మహాసేనాపతిస పేర్లుగల నాణెం కూడా అక్కడ దొరికాయి.**

క్రీ.పూ. 2000నాటి క్లే టాబ్లెట్స్ (మట్టి పలకలు) మీదిది ద్రావిడ భాష లేదా ద్రావిడ మాండలిక తెలుగుభాష. (అప్పటికింకా ద్రవస్థితిలోనే ఉండి వుంటుంది.) అది విడివడి, ప్రత్యేక భాషగా మార్పు చెందడానికి, శతాబ్దాలు పట్టి వుండవచ్చు.

అంతేకాదు, తెలుగువలెనే ద్రావిడ భాషాజనితమైన మరొక భాష 'బ్రాహుఇ' (ఉత్తర ద్రావిడ భాషగా) ఆ ప్రాంతాల్లో నేటికీ వుంది. వాయవ్య భారతంలోని ఇండో యూరోపియన్ భాషా సముద్రంలో ద్రవిడ ద్వీపంలా ఈ 'బ్రాహుఇ' భాష ఉంది. ద్రవిడ జాతీయులు తెలిమన్ నుండి సముద్ర మార్గంగుండా పోయి స్థిరపడినారనుటకు నేటికీ ఈ భాషీయులు సజీవ సాక్షులు. పాకిస్థాన్‌లో కాలత్, ఖైర్‌పూర్, క్వెట్టా, హైదరాబాద్, కరాచీ ప్రాంతాల్లోను, పాకిస్థాన్ సరిహద్దుల్లోని ఆఫ్ఘనిస్థాన్‌లోను, ఇరాన్ దేశంలో కొన్ని జాతులు ఈ భాషను మాట్లాడుతున్నాయి. ద్రావిడ భాషలన్నీ దక్షిణ భారతదేశంలో ఉండగా ఈ ఒక్క 'బ్రాహుఇ' మాత్రం వాయవ్య భారతం దాటి పర్షియా దేశాల్లో స్థిరపడటం భాషా శాస్త్రవేత్తలకు నేటివరకు వింత. దీనికి కారణాలు ఇంతవరకు ఎవరూ చెప్పలేకపోయారు. ఇలా ఒంటరిగా ఇండో యూరోపియన్ భాషా కుటుంబాల మధ్య విదేశాల్లో మిగిలిపోయిన ద్రావిడ భాషా జన్యమైన ఈ "బ్రాహుఇ" తెలివాహనదీ తీరాల నుండి తెలిమన్ల చేత తీసుకపోబడినది. అంతేకాదు ఈ భాష మిగతా ద్రావిడ భాషలకంటె తెలుగుకు అతి దగ్గరగా ఉన్న భాష. (మిసిమి-జనవరి 2005 పేజీ 27,28)

సుమేరియన్ల పురాణ గాథలలో పాతబైబిల్ కథలలో తెలుగు పేర్లు చాలా

వున్నాయని మిసిమిలో గతంలో కూడా కొన్ని వ్యాసాలు వెలువడ్డాయి. ఆఫ్ఘనిస్థాన్‌లోని క్రీ.పూ. నాటి తెలాంగ్ బౌద్ధభిక్షులు, తత్వవేత్తలు తెలంగాణ ప్రాంతానికి చెందినవారే. తెలంగాణ ప్రాంతంనుండి బౌద్ధంతోపాటు తెలంగాణ ప్రజలు ఆఫ్ఘనిస్థాన్, టిబెట్, చైనా దేశాలలోకి ఎలా ప్రస్థానం సాగించారో నాగార్జునుని రచనలు సంస్కృతంలోకన్నా చైనాభాషలోకి మొదట అనువాదం కావడానికి తెలంగాణవారు ఎలా కృషి చేశారో నేను "నాగశాల" కథలో చారిత్రక ఆధారాలననుసరించి ఆనాటి సామాజిక చరిత్ర పరిణామాలను విశ్లేషించాను.

మానవ పరిణామశాస్త్రం ప్రకారం చూస్తే తెలంగాణకు యాభై వేల ఏళ్ల చరిత్ర ఉంది. ఆదిమానవుల జాడలు మొదలుకొని పాతరాతి యుగం, కొత్త రాతియుగం, లోహయుగం ఆధారాలు లభించిన ప్రాంతం ఇది. సింగరేణి బొగ్గు గనుల తవ్వకంలోనూ ఇతరత్రా లక్షల యేళ్ల నాటి శిలాజాలు లభ్యమయ్యాయి. మౌలికంగా తెలంగాణ పూర్వీకులు నాగజాతికి చెందినవారు అని ఒక వాదన ఉన్నది. మహాభారతంలో పేర్కొన్న జాతులకు, తెగలకు తెలంగాణ ప్రాంతం నిలయం. మహాభారత యుద్ధంలో ఆంధ్రులు కౌరవుల పక్షం వహించారన్నది చరిత్రకారులు ఒప్పుకున్న విషయమే. తెలంగాణ ప్రాంతం సీతారాములు సంచరించిన దండకారణ్యంగా, భారత ఉపఖండంలో దక్కను పీఠభూమిగా ప్రాచుర్యం పొందింది. తెలంగాణలో సీతమ్మ కన్నీటి చెలమలు చాలా ఉన్నాయి. "జంబూద్వీపే భరతఖండే.." అనే శ్లోకం ద్వారా దక్కను పీఠభూమి ప్రాధాన్యతతో పాటు జాంబవంతులుగా పిలువబడి తర్వాత మాతంగులుగా పేర్కొనబడిన మాదిగల ప్రాధాన్యత తెలుస్తున్నది. కొన్ని తెలంగాణ గిరిజన తెగలు ఘటోత్కచుని వారసులుగా భావించుకుంటారు. అతిశయోక్తి అనిపించొచ్చుగానీ యావత్ భూఖండంమీద తెలంగాణను పోలిన ప్రదేశం లేదు. ఎందుకంటే ఇక్కడున్నంత జీవావరణము భూఖండంమీద మరెక్కడా లేదు. ఇక్కడ ఉన్నన్ని మట్టిరకాలు, పండించే ధాన్యం రకాలు, ఫల, పుష్ప వృక్షాలు, మూలికలు, ఖనిజాలు, ఔషధులు, పక్షి, జంతు జాతులు మరెక్కడా కనిపించవు.

**ప్రపంచ చరిత్రలో తెలంగాణ ప్రాంతం :**

తెలంగాణ భాషాచరిత్ర సంస్కృతులకు అంతర్జాతీయ ప్రతిపత్తి ఉంది. తెలంగాణవారికి, తెలంగాణ తల్లికి, తెలంగాణ భాషకు ఐరోపాదేశాల నిర్వచనం ప్రకారం ఒక జాతికి, ఒక దేశానికి ఉండే లక్షణాలన్నీ ఉన్నాయి. తెలంగాణ తల్లి బాపు బొమ్మలా, తెలుగుతల్లిలా నాజూకుగా ఉండదు; పి.టి. రెడ్డి, కాపు రాజయ్య, లక్ష్మాగౌడ్, వైకుంఠం, ఏలే లక్ష్మణ్, మొదలైన తెలంగాణ చిత్రకారులు గీసిన తెలంగాణ తల్లి కష్టజీవుల తల్లి. ఉత్పత్తిలో పాల్గొనే పల్లెపట్టు తల్లి.

**ప్రపంచ చరిత్రలో తెలంగాణ దేశం యొక్క స్థానం :**

పరవస్తు లోకేశ్వర్ 'చరిత్ర - వర్తమానం' పుస్తకంలో పేర్కొన్నట్లు ప్రజలను దోచుకునేవారే ప్రజల చరిత్రను కూడా దోచుకుంటారు. తెలుగు నేలను పరిపాలించిన శాతవాహన వంశం. క్రీ.పూ. 221 నుండి క్రీ.శ. 218 వరకు



మొత్తం 439 సంవత్సరాలు శాతవాహనుల వంశంలోని 29 మంది రాజులు పరిపాలించారు. శాతవాహన వంశం తర్వాత ఇక్ష్వాకులు రాజ్యాధికారానికి వచ్చారు. క్రీ.శ. 220-297 మధ్య 75 సంవత్సరాలు తెలంగాణలోని విజయపురి రాజధానిగా పరిపాలించారు. ఆచార్య నాగార్జునుడు శ్రీ పర్వతంపై ఆ కాలంలో ప్రపంచ ప్రసిద్ధిగాంచిన బౌద్ధ విశ్వవిద్యాలయాన్ని నిర్వహించాడు.

**క్రీ.పూ. 300 సం॥ ప్రాంతంలో మగధ రాజైన చంద్రగుప్త మౌర్యుని ఆస్థానాన్ని సందర్శించిన గ్రీకు రాయబారి మెగస్తనీసు తన గ్రంథంలో 30 దుర్గాలు, లక్ష కాల్బలం, రెండువేల అశ్వికదళం, వేయి ఏనుగులు కల చతురంగ బలాలు కల్గిన ఆంధ్రులు మౌర్యుల తర్వాత అతి పెద్ద రాజ్యం కల్గి వున్నారని చెప్పారు. అది కోటిలింగాల ప్రాంతం.**

తర్వాత విష్ణుకుండినులు, ఆనందగోత్రీకులు, శాలంకాయనులు, చోళులు, చాళుక్యులు పరిమిత ప్రాంతాలకు సంబంధించిన కోస్తా, రాయలసీమ రాజవంశాలవారు. ఇక్ష్వాకుల తర్వాత తెలంగాణా నుండి మొత్తం కోస్తా, రాయలసీమతో సహా తెలుగు నేలను అఖండంగా పరిపాలించిన మూడవ రాజవంశం కాకతీయులది. వీరు సుమారు 323 సంవత్సరాలు పాలించారు. (క్రీ.శ. 1000 నుండి 1323 వరకు) నేటి వరంగల్లు వారి రాజధాని. వీరి రాజ్యం తూర్పున కళింగ సముద్రతీరం వరకు, దక్షిణాన శ్రీశైలం వరకు, ఉత్తరాన దేవగిరి వరకు వ్యాపించింది. వీరి పరిపాలనలో ఆర్థిక వ్యవస్థ, కళలు, సాహిత్యం, మతం అభివృద్ధి అంచులను తాకినవి.

తర్వాత కుతుబ్‌షాహీ రాజవంశం (1512-1687) 175 సంవత్సరాల పాటు తెలుగునేలను అఖండంగా పాలించింది. వారి రాజధాని హైద్రాబాదు. నేటి కోస్తా, రాయలసీమలోని అత్యధిక ప్రాంతాలు వీరి పరిపాలనలో ఉండేవి. వీరి తర్వాత అసఫ్‌జాహీ వంశానికి చెందిన నైజాం రాజులు మళ్ళీ హైద్రాబాదు రాజధానిగా దాదాపు ఈనాటి ఆంధ్రప్రదేశ్‌ను పూర్తిగా 224 సంవత్సరాలు పరిపాలించారు. (1724-1948) తెలంగాణ ప్రాంతం నుండి వచ్చిన రాజవంశాలు (శాతవాహనులు 439 సంవత్సరాలు, ఇక్ష్వాకులు 75 సంవత్సరాలు, కాకతీయులు 323 సంవత్సరాలు, కుతుబ్‌షాహీలు 175 సంవత్సరాలు, అసఫ్‌జాహీలు 224 సంవత్సరాలు) మొత్తం 1236 సంవత్సరాలు రాజ్యాధికారంలో ఉండి, ఆంధ్రప్రదేశ్‌ను పరిపాలించాయి. (క్రీ.పూ. 221 నుండి క్రీ.శ. 1948వరకు) మొత్తం 2169 సంవత్సరాల తెలుగునేల చరిత్రలో 1236 సంవత్సరాలు తెలంగాణా ప్రాంతంవారు సంపూర్ణంగా, అఖండంగా రాజ్యమేలారు. (వెయ్యిన్నొక్క శేషప్రశ్నలు, పరవస్తు లోకేశ్వర్, పేజీ నెం. 6,7)

**శూద్రకులాల, గిరిజనుల రాజ్యాలు :**

శాతవాహనుల తర్వాత కొంతకాలం సామ్రాజ్యాలు అంతరించి స్థానిక రాజ్యాల పరిపాలన కొనసాగింది. అవి బౌద్ధం, జైనం ప్రవచించిన పద్ధతిలో కీర్తిని ఆశించకుండా ప్రజాస్వామికీకరణతో ముందుకు సాగినాయి. అందువల్ల అవి శాసనాల ద్వారా గానీ, ఇతరత్రా గానీ రికార్డులను మిగిలించుకోలేకపోయినాయి. ఈ కాలంలోనే ఎన్నో కులాల వాళ్లు స్వతంత్ర రాజులుగా గణతెగ రాజ్యాలను పరిపాలించినారు. చాళుక్యులు ప్రవేశించేనాటికి తెలంగాణలో ఒక ఆదర్శ సంస్కృతి వెల్లివిరుస్తూ ఉండేది. 'నాగశాల' కథలో దీన్ని చిత్రించి చూపాను.

కాకతీయులు, వడ్డెర రాజులు, బేతరాజులు, మేడ రాజులు, రేచర్ల రాజులు, రెడ్డి రాజులు, గొల్లరాజులు, గోండురాజులు, మాదిగరాజులు, మాలరాజులు, వెలమరాజులు, గౌడరాజులు, పద్మశాలీల రాజులు తెలంగాణ ప్రాంతాన్ని పరిపాలించినారు. ఆనాడు తెలంగాణ అంటే ఇప్పుడున్న తెలంగాణ ప్రాంతంకాదు. ఇంతకు నాలుగురెట్ల వైశాల్యంతోవిస్తరించిన దక్కనుపీఠభూమి.

**తెలంగాణ వజ్రాల గని :**

తెలంగాణ వజ్రపు గనులు ప్రపంచ ప్రఖ్యాతి గాంచాయి. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కోహినూరు వజ్రం, జాకబు వజ్రం, అర్గాన్, పిట్స్ వజ్రాలు గొల్లకొండ వజ్రపు గనుల్లో దొరికినాయి. ప్రపంచ చరిత్రలో మొదటిసారి గనులను జాతీయం చేసి రాజ్యం తరఫున దాదాపు 50 వేల మందిని వజ్రాల గనుల్లో పనికి నియమించిన ఘనమైన రాజ్యం ఇది. తెలంగాణలో సమృద్ధమైన పంటలు పండేవి. దాంతో బంగారం, సంపద హెచ్చుగా ఉండేవి.

**దక్కను పీఠభూమి సంపద పెరగడానికి కారణమేమిటి? :**

అందువల్ల ఇది ఎప్పుడూ యుద్ధాల తాకిడికి గురయ్యే ఉత్తరాది రాజులను ఆకర్షిస్తూ ఉండేది. అట్లా వాళ్లు దక్కను పీఠభూమిపైకి దాడులు చేసి ఇక్కడి సంపదను కొల్లగొట్టుకుపోవాలని దండయాత్రలు చేసేవాళ్లు. ఆనాడు గుళ్లు గోపురాలు నేటి బ్యాంకు లాకర్లుగా సంపదను దాచిపెట్టుకునే కేంద్రాలుగా పని చేసేవి. అందుకే గర్భగుడిలోకి ఎవరూ రాకూడదని కట్టడి చేయడం జరిగింది. నారగోని చారిత్రక ఆధారాలతో విస్తారంగా వీటిని గ్రంథస్థం చేశారు. రాజుల దగ్గర కన్నా గుళ్లలో, పూజారుల వద్ద బంగారం, సంపద ఒక్కోసారి ఎక్కువగా వుండేవి. రాజులు వీటిని దాడులు చేసి తరలించుకుపోయేవాళ్లు. ఛత్రపతి శివాజీ కూడా ఈ పని చేసినవాడే. ప్రజల సంపదలో నాలుగో వంతు రాజులకు బలవంతంగా, గుళ్లకు, గోపురాలకు మరో నాలుగో వంతు స్వచ్ఛందంగా చేరేవి. భూస్వామ్య వ్యవస్థ అనేది బౌద్ధ ఆరామాలకు, గుళ్ళకు భూములను అగ్రహారాలుగా దానమివ్వడంతో మొదలైంది. విద్య, వైద్య కేంద్రాలుగా బౌద్ధారామాలు నిర్వహించిన మహోన్నత కర్తవ్యానికి వాటిస్థానంలో గుళ్ళను ప్రవేశపెట్టిన హిందూ దేవాలయాలకు పోలికే లేదు.



**తెలంగాణ భాష మహోన్నతమైనది :**

తెలంగాణలో భాష మహోన్నతంగా ఎదిగింది. ప్రకృతిలోని చెట్లు చేమలు, పశుపక్ష్యాదులు, జంతు జాలం, పని చేసే ఇనిరెలు (పనిముట్లు), ఔషధమొక్కలు, మొదలైన అన్నింటికీ తెలంగాణ భాషలో పదజాలం ఉన్నది. సంస్కృత పాళి భాషల్లోకి, ప్రాకృత భాషల్లోకి, హిందీ భాషల్లోకి తెలంగాణ భాషాపదాలు చేరి శతాబ్దాలుగా సజీవంగా కొనసాగుతున్నాయి. పైశాచి భాష అని పిలువబడే భాష తెలంగాణ భాషలో ఒక మాండలికం వంటిది. నేటికీ నిలిచి వున్న తెలంగాణ భాష ప్రాచీన సరళ గ్రాంథికానికి అతి దగ్గరగా వుంటుంది. అనగా తన ప్రాచీన స్వభావాన్ని కాపాడుకుంటూ వస్తున్నది. త్యాగయ్య, రామదాసు, పోతన, పాల్కురి సోమన పదాల్లోని, పద్యాల్లోని పదాలు ఇందుకు ఉదాహరణ. సంస్కృతి ఆచార వ్యవహారాల విషయాల్లోను ఇది తన ప్రత్యేకతను కాపాడుకుంటూ వస్తున్నది. అమ్మదేవతలు, గ్రామదేవతలు, తల్లి సంస్కృతి, పోచమ్మ, ఎల్లమ్మ, కట్టమైసమ్మ మొదలైన మాతృస్వామ్య మాతలు ఇప్పటికీ నీరాజనాలు అందుకుంటున్నారు. మరికొన్ని గుళ్లు మగదేవతలుగా మార్చబడ్డాయి. బౌద్ధం, జైనం సన్నగిల్లుతున్నప్పుడు వాటి గుళ్లను, ఆరామాలను శైవ, వైష్ణవ గుళ్లుగా మార్చారు. ఉదా॥కు వేములవాడలోని జైనాలయం శివాలయంగా మార్చబడింది. ఇప్పుడున్న ప్రముఖ హిందూ ఆలయాలన్నీ ఒకప్పటి జైన, బౌద్ధ ప్రార్థనా స్థలాలే.

**తెలివాహ నది గోదావరే కావడంవల్ల తెలుగునాట గోదావరి తీర ప్రాంతాలైన అశ్మక, మూలక రాజ్యాలు అత్యంత ప్రాచీన జన పదాలు కావడంవల్ల తెలుగు భాషా సంస్కృతులు ఇక్కడే వికసించాయనవచ్చు. ప్రముఖ ఎటిమ లొజిష్టు ప్రొ. యార్లగడ్డ బాలగంగాధర రావు గారు తెలంగాణలోనే తెలుగు పుట్టిందని; అది ఇతర ప్రాంతాలకు విస్తరించిందని నిర్ధారించారు.**

**గొలుసు చెరువుల నిర్మాణంలో ప్రపంచానికే ఆదర్శం :**

తెలంగాణ భారతదేశానికి అపూర్వమైన అనుసంధాన (లింక్) నీటిపారుదల వ్యవస్థగా దశబంద గొలుసు చెరువుల నిర్మాణ రీతులను అందించింది. తద్వారా వరదలను అరికట్టింది. నదులనుండి కాలువలు తీసి పంట కాలువలకు మళ్లించారు. జానపద కళలు, కళారూపాలు, సంస్కృతుల ద్వారా సమాజ చరిత్రను పరిణామాలను ఇప్పటికీ సజీవంగా నిలుపుకున్నది. ఆయా కుల పురాణాలు, చిందు భాగోతం, జాంబవంతుల కథ, శారదకాండ్రు, బైరూపులోల్లు, గొల్లసుద్దులు, బైండ్ల కథలు, బైరాగి తత్త్వాలు, ఎల్లమ్మ కథలు, మోటబాయి పాటలు, అచలతత్త్వ గీతాలు, బాలసంతులోల్లు, దొమ్మరి విద్యలు, గారడి విద్యలు మొదలైనవి క్రీస్తుశకం ఏడో శతాబ్దం నుంచి చిన్న చిన్న మార్పులతో తమ మూలస్వభావంతో ఇప్పటికీ సజీవంగా కొనసాగుతున్నాయి.

**దేశవ్యాప్తమైన బతుకమ్మ పండుగ :**

బతుకమ్మ పండుగ తెలంగాణ జానపదుల కళాత్మక హృదయాన్ని ఆవిష్కరిస్తుంది.

ఇది ఉత్తరప్రదేశ్, బీహారు, పంజాబ్ వంటి ప్రాంతాలకు విస్తరించింది. ఇప్పటికీ దీని ఆనవాళ్లుగా అక్కడ కొన్ని పండుగలు కొనసాగుతున్నాయి. మరింత ముందుకు వెళ్తే మెసపొటేమియా, గ్రీకు, చైనా, ఈజిప్టు, బెత్లహేమ్ నాగరికతలకు తెలంగాణకు అవినాభావ సంబంధం ఉన్నదని తిరుమల రామచంద్ర, రాంభట్ల కృష్ణమూర్తి, గడియారం శ్రీవత్స, సంయుక్త కూనియ్య, సంగనభట్ల నర్సయ్య చారిత్రక ఆధారాలు చూపించారు. మెసపొటేమియా నాగరికతలోని మాతృదేవతలు మైసమ్మ పోచమ్మ, ఎల్లమ్మ మొదలైన పేర్లతో తెలంగాణలో ఇప్పటికీ నిలిచి ఉన్నారు. కంచ బలయ్య దీనిపై విశేష పరిశోధనలతో చరిత్ర వెలికి తీస్తున్నారు. మెసపటోమియా, హిబ్రూ, రోమన్, పాళీ, ప్రాకృత, అరబ్బీ, ఉర్దూ , హిందీ భాషలు, బైబిల్ పాత నిబంధన నాటి పదాలు, సంస్కృతి తెలంగాణ సంస్కృతికి సమీపంగా ఉంటాయి.

**బౌద్ధం, జైనం తంత్రవాదం, వీరశైవం పరిఢవిల్లిన భూమి :**

తెలంగాణ బౌద్ధం, జైనం, చార్వాకం, లోకాయత, తంత్రవాదం, వీరశైవం ఉద్యమాలకు నిలయం. ప్రతి ఉద్యమాన్ని తెలంగాణ సొంతం చేసుకుంది. కన్నడ భాషలోని ఆదికావ్యం పంప భారతం నన్నయ్యకు రెండు వందల యేళ్లకు ముందు 9వ శతాబ్దంలో తెలంగాణలోని కరీంనగర్ జిల్లా నుంచి వెలువడింది. కన్నడిగుల ఆదికవి పంపన సమాధి నిజామాబాద్ జిల్లా బోధన్‌లో నేటికీ వుంది. కన్నడ సాహిత్యకారులు ఆ స్థలాన్ని ఎంతో పవిత్రంగా దర్శిస్తుంటారు. శ్రీపర్వతం అను నాగార్జున కొండ విశ్వవిద్యాలయం ఆచార్య నాగార్జునుని బోధనలు తెలంగాణ కేంద్రంగా కొనసాగాయి. జైనం తర్వాత ఇస్లాం సూఫీతత్వం నుంచి కులాతీత సమానత్వ స్ఫూర్తి పొందిన బసవని వీరశైవోద్యమం పాల్కుర్కి సోమనాథుల మీదుగా తెలంగాణ అంతటా విస్తరించింది. మల్లన్న గుడులు, మల్లికార్జున గుడులు, సిద్ధుల గుట్టలు అలా వెలిసినవే. వీరవైష్ణవం, భక్తి ఉద్యమాలు ప్రతి ఊరా ఆంజనేయస్వామి విగ్రహాలను స్థాపించే విధంగా చేసినాయి, శాతవాహనులు సింహం మీద స్వారీ చేసిన కథ అనుసరించి కొన్ని తెలంగాణ జిల్లాల్లో నరసింహస్వామి గుడులు ఎక్కువగా వెలిసాయి.

**తెలంగాణ ప్రజలు ప్రకృతి ఆరాధకులు :**

తెలంగాణ ప్రజలు ప్రకృతి ఆరాధకులు. ప్రకృతిపై ఆధిపత్యం చెలాయించకుండా ప్రకృతిలో సహజీవనం చేస్తారు. ప్రకృతి ఆనందంలో లీనమైపోతారు. అందువల్ల వారు నిర్మలంగా, నిష్కపటంగా స్వచ్ఛంగా జీవిస్తారు. తమ దగ్గరికి వచ్చిన వారికి సాదరంగా ఆశ్రయమిస్తారు. అట్లా ఎన్నో రాజవంశాలను, ఎన్నో తెగలను, ఎన్నో ప్రాంతాల ప్రజలను, ఎన్నో మతాలను తమలో కలుపుకున్నారు. తమ సంస్కృతిని సుసంపన్నం చేసుకున్నారు. పొలాల అమాస, పీర్ల పండుగ, ఉర్సులు, హోళీ, రాఖీ, పెత్రమాస, దసరా, దీపావళి, నాగపంచమి, నాగచవితి, కాటమరాజు పండుగ మొదలైనవి ఎన్నెన్నో ప్రాంతాల నుంచి ఇక్కడికి చేరవచ్చి ఇక్కడి స్థానిక సంస్కృతిలో కలిసిపోయినాయి.



**మల్లన్నదేవుడిగా – కుక్క :**

ఇక్కడి ప్రజలు కుక్కను మల్లన్న దేవుని ప్రతీకగా భావిస్తారు. కప్పను, పిల్లిని చంపరు. బల్లిని తాకరు. పాలమిందెను చంపితే పాపమంటారు. రాత్రిపూట చెట్లను తాకరు. పెళ్లి నాడు "అందుగు గుంజ"ను పందిరిలో నాటుతారు. ఇళ్లల్లో పక్షులు నివసించడానికి చూర్లకింద వాటికి ప్రత్యేకమైన గూళ్ళు కట్టించేవారు. నాగుపామును తప్పనిసరిగా చంపాల్సివస్తే దాని నోట్లో రాగినాణెం పెట్టి, భక్తితో దహనం చేస్తారు. ఇలా చెట్లను, పశుపక్ష్యాదులను పవిత్రంగా చూసుకునే జాతి ఇది. వాటిని పూజించే సంస్కృతి ఇప్పటికీ కొనసాగుతున్నది. అడవి మీద, ఇతర ప్రాణకోటి మీద గెలవడానికి మానవునికి మొట్టమొదట మచ్చికై సహకరించింది కుక్కే! కుక్కలను పూజించే సంస్కృతి వేదకాలం కన్నా సింధూ నాగరికత కన్నా పాతకాలం నాటిదని లోకాయత గ్రంథంలో దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ నిర్ధారించారు.

> కరీంనగర్ జిల్లా పాశాయిగాం, ధూళికట్ట, పెద్దబొంకూరు మొ॥ ప్రాంతాల్లో బౌద్ధం వ్యాప్తం అయిన కారణంగా ప్రచారంలో ఉన్న పాళీభాష నిజానికి ప్రాకృతభేదం కాదని ఇది తొలినాళ్ల తెలుగేనని చాలామంది అభిప్రాయం. తెలివాహ నది ఒడ్డున పుట్టినదే తెలుగుభాష. క్రీ.శ. 102లో గ్రీకు భౌగోళికుడు టాలెమీ చెప్పిన 'టెలింగానే' ఈ తెలంగాణమే. తెలుగులో ల-నగామారి తెలుగు తెనుగు అయ్యింది.

ప్రపంచ నాగరికతలను, సంస్కృతులను తనలో ఇమిడ్చుకొని సుసంపన్నం కావడం ప్రపంచదేశాలకు విస్తరించడం తెలంగాణ విశిష్టత. అందువల్ల తెలంగాణ చరిత్ర, సంస్కృతి, ఆచారావ్యవహారాలు జాతీయ, అంతర్జాతీయ సంబంధాలతో పెనవేసుకుపోయింది.

**మధ్యయుగాల్లో దక్కను పీఠభూమి – హైదరాబాదు నిర్మాణం :**

మధ్యయుగాల్లో దక్కను పీఠభూమిలో ఎన్నో చిన్న రాజ్యాలు వెలిసాయి. సామంత రాజ్యాలుగా కొన్ని కొనసాగినాయి. మహ్మదీయ పాలకులు దక్కను పీఠభూమిని మాతృభూమిగా ప్రేమించి అంకితమయ్యారు. కులీకుతుబ్‌షా వరదలను అరికట్టడానికి మూసీనది వెంట రాతికట్ట నిర్మించాడు. హైదరాబాదు నగరాన్ని శతాబ్దాల క్రితమే మహానగరంగా అభివృద్ధి పరిచాడు. ప్రపంచంలోని సుందరమైన చారిత్రక నగరాల్లో హైదరాబాదు కూడా ఒకటి. నాలుగు వందల యేళ్ల క్రితం ఇరాన్‌లోని ఇస్ఫహాన్ నగర రీతిలో, వ్యూహంతో నిర్మించిన నగరమిది. ఇట్లా అమెరికాలోని నగరాల కన్నా సంపన్న సంస్కృతి, చరిత్ర గల నగరం ఇది.

**చరిత్ర, సంస్కృతి ప్రాధాన్యత :**

ఒక ప్రాంతంలో, దేశంలో విప్లవ కార్యక్రమాన్ని రూపొందించడానికి ముందు కనీసం అక్కడి వందేళ్ల చరిత్రను, సంస్కృతిని, మానవ సంబంధాలను, సామాజిక పరిణామక్రమాలను, వాటిని నడిపిస్తున్న దృశ్యాదృశ్య శక్తులను, చలనసూత్రాలను

అధ్యయనం చేసి, అందుకు అనుగుణంగా కార్యాచరణను రూపొందించుకోవాలని మావో పలుమార్లు నొక్కి చెప్పారు. భారతదేశంలో ఇందుకు విరుద్ధంగా జరుగుతున్నది. విప్లవించే శక్తులు వందేళ్ల చరిత్రను, సంస్కృతిని, సామాజిక పరిణామ క్రమాల తీరుతెన్నులను విశ్లేషించడం కాకుండా విచ్ఛిన్నం చేసి పాక్షిక సత్యాలను, అర్ధ సత్యాలను, అసత్యాలను సత్యాలుగా, దృక్పథాలుగా మలుచుకుంటున్నాయి.

**బ్రిటిషాంధ్ర వలసాధిపత్యం దృష్టిలో కూరుకుపోయిన కమ్యూనిస్టులు, నక్సలైట్లు:**

చరిత్రను అధ్యయనం చేసి వుంటే తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర సమస్యను సిపిఐ, సిపిఎంలు తప్పకుండా గుర్తించి వుండేవి. కుల సమస్యను, మత సమస్యను సిపిఐ నుంచి మొదలుకొని ఎంఎల్ గ్రూపుల దాకా 70 యేళ్లుగా అధ్యయనం చేయకుండానే చరిత్రను, సత్యాలను విచ్ఛిన్నం చేసి చూపారు. అందులో భాగంగా తెలంగాణ శతాబ్దాల చరిత్ర కూడామరుగున పడిపోయింది. కొందరు తెలంగాణకు సాయుధ పోరాటం తర్వాతే చరిత్ర, సంస్కృతి ఏర్పడినాయని, మరికొందరు 1970 తర్వాతే తెలంగాణకు చరిత్ర, సంస్కృతి రూపుదిద్దుకున్నాయని, ఇంకొందరు ఎంఎల్ గ్రూపుల పోరాటాలు వారి సాహిత్యం వారి చరిత్ర తప్ప ఇంకేదీ లేదని మిగతా ప్రజలను ప్రజలుగా గుర్తించ దల్చుకోలేదని చెబుతున్నట్లు అర్థం అవుతున్నది.

**మొగలు రాజ్యం నుండి దక్కన్ స్వతంత్ర రాజ్యంగా అభివృద్ధి చెందిన తీరు :**

క్రీ.శ. 1687 నుండి 1724 వరకు మొఘలు చక్రవర్తుల పాలన సాగింది. వారికి సామంతులుగా ఉన్న నిజాం రాజవంశీకులు 1724లో స్వతంత్రం ప్రకటించుకొని నిజాం రాజ్యాన్ని తమదైన ప్రత్యేక శైలిలో అభివృద్ధి పరిచారు. ప్రపంచంలోనే అత్యంత ధనవంతమైన రాజ్యంగా నైజాం రాజ్యాన్ని ఎదిగించారు. సాలార్‌జంగ్ మ్యూజియం వంటి అపురూప సంపదను సేకరించారు. జాతీయం చేసిన వజ్రపు గనులున్న మొట్టమొదటి దేశం ఇది. నిజాం స్టేట్ రైల్వేస్‌ను, సింగరేణి బొగ్గుగనులను, పారిశ్రామిక వాడలను నూటయాభై యేళ్ల క్రితం స్థాపించారు. బ్రిటిష్ పరిపాలకుల అభివృద్ధితో పోటీ పడ్డారు. సింగరేణి కాలరీస్ 1890లో లండన్‌లో షేర్ మార్కట్‌లో లిస్టయిన ఏకైక భారతీయ సంస్థ. తెలంగాణ రాజ్యంలో నిజాం కాలంలో హైదరాబాదులోనే కాకుండా హకీంపేటలో, వరంగల్లులో, ఆదిలాబాదులో పలు జిల్లాల్లో విమానాశ్రయాలను కట్టించారు. బ్రిటిష్ పరిపాలన ప్రాంతంలో కరెంటు లేని కాలంలోనే జనరేటరు సాయంతో నైజాం రాజ్యంలో విద్యుత్తు సరఫరా జరిగింది.

అలీఘర్ ముస్లిం యూనివర్శిటీకి నైజాం రాజు భూరి విరాళాలిచ్చినారు. విద్యాభివృద్ధి కోసం కరువు కాలంలో ప్రజలకు పని కల్పించడం కోసం 1918లో ఉస్మానియా యూనివర్సిటీని నెలకొల్పినాడు. నైజాం రాజ్యంలోని మంత్రి వి.ఎస్.వెంకట్రావు, మ్యాదరి బాగయ్య, భాగ్యరెడ్డి వర్మగారల చొరవతో డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ ఔరంగాబాదులో కళాశాల నెలకొల్పడానికి పది లక్షల రూపాయలు విరాళం ఇవ్వడం జరిగింది. నిజాం రాజ్యంలో గొప్ప సంఘసంస్కరణలు జరిగాయి. 1925లో



క్రీ.పూ. 2000 నాటి సుమేరియన్ క్లే టాబ్లెట్స్ మీద ద్రావిడ భాష లేదా ద్రావిడ మాండలికంగా తెలుగుభాష విడివడి, ప్రత్యేక భాషగా మార్పు చెందడాన్కి శతాబ్దాలు పట్టి ఉండవచ్చు. తెలుగు వలెనే ద్రావిడ భాషాజనితమైన మరొక భాష 'బ్రాహుఇ' నేటికీ ఆఫ్ఘనిస్థాన్‌లోని ఇండోయూరోపియన్ భాషా సముద్రంలో ద్రవిడ ద్వీపంలా ఉంది. ద్రవిడ జాతీయులు తెలిమన్ నుండి సముద్ర మార్గం గుండా పోయి స్థిరపడ్డారు. నేటికీ ఈ భాషీయులు సజీవసాక్షులు.

కుసుమధర్మన్న శతకంలో ప్రశంసించిన 42 మంది సంఘసంస్కర్తల్లో, 40 మంది నైజాం ప్రాంతంవారే. భాగ్యరెడ్డి వర్మ అను మ్యాదరి బాగయ్య నాయకత్వంలో షెడ్యూల్డు కులాల అభ్యున్నతి కోసం ఆది హిందూ ఉద్యమం సాగింది. పలు కుల సంఘాల ఏర్పాటు రూపంలో సంఘ సంస్కరణోద్యమాలు సాగినై. గ్రంథాల యోద్యమం, సంఘ సంస్కరణ ఉద్యమానికి ఒక వేదిక. తెలంగాణ చేనేత వృత్తిపనివారు భారత పారిశ్రామిక రంగానికి ఇంగ్లాండు, ఫ్రాన్స్ పారిశ్రామిక విప్లవాలకు మూలధనమైనారు. బ్రిటిష్‌వారు చేతివృత్తి కులాల నిపుణుల, కళాకారుల చేతులు నరికివేసారు. వారి వృత్తి నైపుణ్యం ఎంత గొప్పదో సాలార్‌జంగ్ మ్యూజియం ఒక సజీవ సాక్ష్యం.

**సిపాయిల తిరుగుబాటు నాయకుడు తుర్రె బాజ్‌ఖాన్ :**

భారతదేశ చరిత్రను మలుపు తిప్పిన 1857 సిపాయిల తిరుగుబాటుకు నాయకత్వం వహించింది కూడా హైదరాబాదుకు చెందిన తుర్రేబాజ్‌ఖాన్. బ్రిటిష్ ప్రభుత్వం అతడ్ని శిక్షించాలని నిజాం రాజును కోరడంతో విచారణ జరిపి నేటి తుర్రేబాజ్‌ఖాన్ రోడ్డు (కోఠీ – అఫ్జల్‌గంజ్ రోడ్డు) లో గల ఆనాటి జామ్‌బాగ్ మెయిన్‌గేటుకు తుర్రేబాజ్‌ఖాన్‌ను వేలాడదీసి ఉరితీసినారు.

**గోండు రాజ్యాలు :**

గోండులు శతాబ్దాల తరబడి స్వతంత్ర రాజ్యాలను ఏలినారు. సమ్మక్క సారక్కలతో పాటు రాజగోండులు మైదాన ప్రాంత రాజులకు వ్యతిరేకంగా పోరాటం చేసారు. 1857లో రోహిల్లాలతో పాటు మరో వంద మంది గోండులను నిర్మల్‌లో ఊడల మర్రికి ఉరితీశారు. ఆ చెట్టు ఇప్పటికీ ఉంది. ఇట్లా తెలంగాణ చరిత్రకు ఒక ప్రత్యేక అస్తిత్వం ఉంది. అది జాతీయోద్యమ భారత దేశానికి కోస్తాంధ్ర ప్రాంతానికి, దక్షిణాదికి సమాంతరంగా సాగిన స్వతంత్ర చరిత్ర. ఈ విషయం ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత పాఠ్యపుస్తకాల్లో చేర్చకపోవడం వల్ల తెలియకుండా పోయింది. ఉర్దూ రాకపోవడం, హైదరాబాదు సంస్థానంలో ఉన్న గ్రంథాలయాలు డాక్యుమెంట్లు చూసే ఆసక్తి, అవసరం లేకపోవడం వల్ల చాలా మంది 1920 తర్వాత నుంచి ఒక పార్శ్వపు చరిత్రను మొత్తం చరిత్రగా చెప్పుకుంటూ వచ్చారు. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్‌ను మ్యాదరి బాగయ్య, వి.ఎస్. వెంకట్రావు (నైజాం మంత్రి) ఎన్నో సూచనలిచ్చి ముందుకు నడిపారు.

**ఆంధ్ర మహాసభ గ్రంథాలయోద్యమం :**

ఆంధ్ర మహాసభ గ్రంథాలయోద్యమం పేరుతో తెలంగాణలో సంఘసంస్కరణ, ఉద్యమం నైజాం వ్యతిరేక ఉద్యమం కలగలసి కొనసాగిన్నై. మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, జమలాపురం కేశవరావు, వట్టికోట ఆళ్వారుస్వామి, కొండా వెంకటరంగారెడ్డి, స్వామి రామానందతీర్థ, ఆర్యసమాజ్ ఉద్యమం, కులవృత్తి సంఘాల ఉద్యమాలు తెలంగాణ పునరుజ్జీవనానికి కృషి చేసినాయి, తెలంగాణ చేనేత వృత్తి పనివారు బొంబాయి వలస వెళ్ళి బట్టల మిల్లు కార్మికులుగా మారి కార్మిక చైతన్యంతో గ్రామాలను చైతన్యవంతం చేసారు. ఆంధ్రజన సంఘం పేరుతో మొట్టమొదట తెలుగు సంఘాన్ని స్థాపించింది తెలంగాణ నేత కార్మికులు. వీరు చదువులు చదువుకొని ఇతర వ్యాపారాలలోకి వెళ్లి సాంఘిక చైతన్యానికి నాంది పలికారు.

**ప్రపంచ కార్మిక చరిత్ర నిర్మించిన మిల్లు కార్మికులు :**

చికాగోలో కన్నా ముందు 1872 లోనే భారతదేశంలోని మొట్టమొదటి పారిశ్రామిక జౌళి మిల్లు సమ్మెలను మహాత్మా జ్యోతిబా ఫూలే, మేఖన్‌జీ నారాయణలోఖండే నాయకత్వంలో సత్యశోధక సమాజ ఉద్యమంద్వారా (బాలగంగాధర్ తిలక్ నాయకుడుగా ఎదగకముందే) విజయవంతం చేసింది తెలంగాణ చేనేత కార్మిక శ్రేణులే. నిజాం నేతపని వారి వలసలను గమనించి వారికి స్థానికంగా ఉపాధి అవకాశాల కోసం ఆజంజాహీ మిల్లు వంటి పరిశ్రమలను స్థాపించాడు. ప్రపంచంలో వస్తున్న అభివృద్ధిని వెంటవెంటనే తన దేశంలో అందించే కృషిని నిజాం నిరంతరం కొనసాగించినాడు.

**నిజాం దేశం బ్రిటిష్ పాలిత ప్రాంతాలకన్నా వెనుకబడి పోయిందా? :**

బ్రిటిష్ పాలిత ప్రాంతాల కన్నా నిజాం రాజ్యం వెనుకబడి పోయిందనే ప్రచారం నేల విడిచి సాధించే 'అభివృద్ధి' ని, వ్యాపార సంస్కృతిని గొప్పదని భావించే వాళ్లది. దేశీయ వనరులను ప్రజల అవసరాలకు అనుగుణంగా అభివృద్ధి పరచడమే నిజమైన అభివృద్ధి. నిజాం రాజ్యం దీన్ని సమర్థవంతంగా సాధించడం వల్ల ప్రపంచంలోని అత్యంత ధనిక రాజ్యాల్లో ఒకటిగా గుర్తింపబడింది. బ్రిటిష్‌వారి రూపాయికి నైజాం రూపాయికి మధ్య మారకం విలువల్లో సమానత ఉండేది. ఇది అర్థశాస్త్ర పరిభాషలో ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని, వేగాన్ని సూచిస్తుంది.

**ప్రపంచంలో సంపన్నదేశంగా తెలంగాణ :**

ప్రజలు పేదలైనప్పుడు ప్రభుత్వం దగ్గర సంపద ఎట్లా ఉంటుంది? సంపద అధికం కావడం వల్లనే నిజాం రాజ్యం అత్యంత ధనిక రాజ్యమైందనే విషయం ఈనాటి తెలంగాణ యువతరం అర్థం చేసుకోవలసి ఉన్నది. ఇతర తెలుగు ప్రాంతాల్లో అభివృద్ధి చెందిన నగరాలు లేవు. హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి రాజధాని



కావడం చారిత్రకంగా సహజ పరిణామం. దక్కను పీఠభూమికి కోటిలింగాల, పైఠాన్, ఓరుగల్లు, బోధన్, వేములవాడ, హైదరాబాదు చారిత్రకంగా రాజధాని కేంద్రాలుగా శతాబ్దాల క్రితమే అభివృద్ధి చెందాయి. బ్రిటిషాంధ్రలోని పట్టణాలు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాతికాలంలో అభివృద్ధి చెందినవి.

**ద్రవిడ జాతీయులు తెలిమన్ నుండి సముద్రమార్గం గుండా పోయి స్థిరపడి నారనుటకు నేటికీ 'బ్రాహుఇ' భాషీయులు సజీవ సాక్షులు. పాకిస్థాన్‌లో కాలత్, హైర్‌పూర్, క్వెట్టా, హైదరాబాద్, కరాచీ ప్రాంతాల్లోను, పాకిస్థాన్ సరిహద్దుల్లోని ఆఫ్ఘనిస్థాన్‌లోను, ఇరాన్ దేశంలో కొన్ని జాతులు ఈ భాషను మాట్లాడుతున్నాయి. ఇది ద్రవిడ భాషల కంటే తెలుగుకు దగ్గరగా ఉన్న భాష.**

మన చరిత్రను మనం తెలుసు కోలేకపోతే, అణచి వేయడం ద్వారా మన చరిత్రను అవమానించడం ద్వారా మనలను అణచివేస్తారు. అవమానిస్తారు. ఆంధ్రుల సాంఘిక చరిత్ర అనే గ్రంథం ద్వారా సురవరం ప్రతాపరెడ్డి చేసిన కృషి అపూర్వం. బి.యన్.శాస్త్రి వేల పేజీల ద్వారా శాసనాల ఆధారంతో తెలంగాణ చరిత్రను సమున్నతంగా నిలబెట్టారు. కొమర్రాజు వెంకటలక్ష్మణరావు కూడా తెలంగాణ ప్రాంత ఔన్నత్యాన్ని ఎన్నో ఉదాహరణలతో సహా వివరించారు. దీన్ని కొనసాగించవలసిన బాధ్యత యువతరంపై ఉంది.

**ప్రతిభకు పట్టం కట్టిన నైజాం రాజులు :**

దక్కను రాజులు ప్రతిభావంతులను సమర్థులను నియమించుకోవడం అవసరమని దేశదేశాల నుంచి ఎందరినో తమ సంస్థానాల్లో ఉద్యోగాల్లో నియమించుకున్నారు. అందుకే ఇక్కడ ప్రపంచంలోనే మెరుగైన పాలనారీతులు తెలిసిన అధికారులుండేవారు. టర్కీ సింహాసనపు పాలన వారసత్వాన్ని సొంతం చేసుకున్న రాచరిక వ్యవస్థ ఇక్కడుండేది. టర్కీయే తురక అనే పదంగా మారింది. స్థానికులకు అవకాశాలు సన్నగిల్లడంతో పాటు వారు స్థానికులను చిన్నచూపు చూడడం వల్ల స్థానికులకే ఉద్యోగాలు ఇవ్వాలని 500 ఏళ్లుగా ఎప్పటికప్పుడు ముల్కీ (స్థానిక) పోరాటాలు జరిగాయి. శోభాగాంధి, పి. లోకేశ్వర్‌ల 'ప్రత్యేక తెలంగాణ ఉద్యమ చరిత్ర'లో వీటిని చక్కగా పొందుపరిచినారు. 1950ల్లో కూడా ఈ ముల్కీ ఉద్యమం సాగింది. అది ఇంకా పలురూపాల్లో కొనసాగుతూనే వుంది.

బ్రిటీష్ ప్రభుత్వంతో పోటీపడి నైజాం దేశం పలు పరిశ్రమలను స్థాపించింది. ఇతర ప్రాంతలకు వలస వెళ్ళ ఉండడాన్ని నిరోధిస్తూ వారికి ఉపాధి అవకాశాలను కలిగించింది. నిజాం దేశంలో స్థాపించిన కొన్ని ముఖ్యమైన పరిశ్రమలు ఇలా ఉన్నాయి:

## నైజాం కాలంలో తెలంగాణాలో పరిశ్రమల స్థాపన

| | | | |
|---|---|---|---|
| 1871 | సింగరేణి బొగ్గు గనులు | 1931 | ఆజంజాహీ మిల్స్, వరంగల్ |
| 1873 | మొదటి స్పిన్నింగ్ మిల్లు | 1932 | ఆర్‌టిసి స్థాపన |
| 1876 | ఫిరంగుల ఫ్యాక్టరీ | 1937 | నిజాం షుగర్ ఫ్యాక్టరీ |
| 1876 | ప్రభుత్వ ప్రింటింగ్ ప్రెస్ | 1939 | సిర్పూర్ పేపర్ మిల్లు |
| 1910 | ఐరన్ ఫ్యాక్టరీ | 1941 | గోల్కొండ సిగరెట్ ఫ్యాక్టరీ |
| 1916 | దక్కన్ బటన్ ఫ్యాక్టరీ | 1942 | హైదరాబాద్ స్టేట్ బ్యాంక్ |
| 1919 | వి.ఎస్.టి. ఫ్యాక్టరీ | 1942 | హైదరాబాద్ ఆల్విన్ ఆటో |
| 1921 | కెమికల్ లాబోరేటరీ | 1943 | ప్రాగా టూల్స్ |
| 1927 | దక్కన్ గ్లాస్ ఫ్యాక్టరీ | 1946 | హైదరాబాద్ ఆస్బెస్టాస్ |
| 1929 | డి.బి.ఆర్. మిల్స్ | 1947 | హైదరాబాద్ లామినేషన్ ప్రొడక్ట్స్ |

## తెలంగాణాలో వివిధ ప్రభుత్వ శాఖల స్థాపన

| | | | |
|---|---|---|---|
| 1864 | రెవెన్యూశాఖ | 1882 | ఎక్సైజ్ శాఖ (అబ్కారీ) |
| 1866 | కస్టమ్స్‌శాఖ | 1883 | పోలీస్ శాఖ |
| 1866 | జిల్లాల నిర్మాణం | 1892 | గనుల శాఖ |
| 1866 | వైద్యశాఖ | 1892 | పరిశ్రమలు, వాణిజ్యశాఖ |
| 1866 | మొదటి రైల్వేలైను బొంబై-రాయచూర్ | 1893 | లోకల్ ఫండ్ శాఖ |
| | | 1896 | నీటిపారుదల శాఖ |
| 1867 | ప్రింటింగ్ & స్టేషనరీ | 1911 | స్టేట్ లైఫ్ ఇన్సూరెన్స్ ఫండ్ |
| 1867 | ఎండోమెంట్ శాఖ | 1912 | సిటీ ఇంప్రూవ్‌మెంట్ సర్వీస్ (Like HUDA) |
| 1867 | అటవీశాఖ(జంగ్లాత్) | | |
| 1869 | మునిసిపల్‌శాఖ | 1913 | వ్యవసాయ శాఖ |
| 1869 | పబ్లిక్‌వర్క్స్ శాఖ | 1913 | హైదరాబాద్ సివిల్ సర్వీస్ (Like APPSC) |
| 1870 | హైకోర్టు ఏర్పాటు | | |
| 1875 | సర్వే,సెటిల్‌మెంట్‌శాఖ | 1914 | ఆర్కియాలజీ శాఖ |
| 1876 | లాండ్‌సెటిల్‌మెంట్‌శాఖ | 1932 | ఆకాశవాణి, హైదరాబాద్ |
| 1881 | జనాభా లెక్కల సేకరణ | 1945 | కార్మిక శాఖ |



**క్రీపూ. 3వ శతాబ్దంలోని ఆఫ్ఘనిస్థాన్‌కు చెందిన తెలాంగ్ బౌద్ధ తత్త్వవేత్తలు తెలంగాణ జాతికి, భాషకు చెందినవారే. తెలాంగ్ గిరిజన తెగ మధ్యప్రదేశ్‌లో, ఛత్తీస్‌ఘడ్‌లలో ఇప్పటికీ కొనసాగుతున్నది. వంగ, కళింగలాగే తెలంగ పదం వేల ఏళ్ళుగా కొనసాగుతూ వస్తున్నది. క్రీపూ. నుండి తెలంగాణ ప్రాంతం నుండి బౌద్ధ ప్రచారం చేస్తూ ఆఫ్ఘనిస్థాన్, ఇరాక్, ఇరాన్, టిబెట్, చైనాదాకా శతాబ్దాల తరబడి సంచరించారు. చైనా భాషలోకి బౌద్ధ గ్రంథాలను అనువదించారు.**

అలాగే నైజాం దేశం బ్రిటీష్ ప్రభుత్వం కన్నా సమర్థవంతంగా తమ పరిపాలన శాఖలను ఏర్పరచి తీర్చిదిద్దింది. ఏ ప్రభుత్వ శాఖను ఎప్పుడు ఎలా? స్థాపించిందో పై పట్టిక స్పష్టం చేస్తుంది. ప్రపంచంలోనే ఒక సమర్థవంతమైన పరిపాలనగల దేశంగా నైజాం దేశం ప్రపంచదేశాల్లో గొప్ప గుర్తింపు పొందింది.

సుమారు 1936 నుండి ఒకవైపు కమ్యూనిస్టులు, ఇంకోవైపు రజాకార్లు విస్తరించడంవల్ల నైజాం రాజు రజాకార్లకు మద్దతివ్వడంవల్ల నైజాం దేశం చాలా నష్టపోయింది. ఇలా విప్లవంతోపాటు కౌంటర్ రెవెల్యూషన్ రెండూ కూడా తెలంగాణ సమాజం నష్టపోవడానికి దారితీశాయి. తన దేశంలోని ఇతర ప్రముఖులను కలుపుకుని ప్రపంచ వ్యాప్తంగా ఒక అభిప్రాయాన్ని కూడగట్టివుంటే, సిక్కిం, నేపాల్, భూటాన్ దేశాల్లా కనీసం గోవా, పాండిచ్చేరి రాష్ట్రాల్లా స్వతంత్ర దేశంగా నైజాం దేశం భారతదేశంలో అంతర్భాగంగా 1947 తర్వాత కూడా కొనసాగివుండేది. నిజాం రాజు ముస్లిం మతవ్యాప్తి ప్రలోభంలోపడి రజాకార్లకు మద్దతివ్వడంవల్ల అంతదాకా ఉన్న మంచిపేరు తుడిచి పెట్టుకుపోయింది. ప్రపంచదేశాల నైతిక మద్దతు సంపాదించలేకపోయాడు. నైజాం రాజు అనాలోచిత నిర్ణయాలవల్ల కాశ్మీర్ ఏకాకిగా మిగిలి, స్వతంత్ర దేశం స్థాయిని కోల్పోయి అగ్నిగుండంగా మారింది.

**తెలంగాణ రాష్ట్రోద్యమాలు :**

ఉద్యమాలు వెనకబడ్డవాళ్లని ముందుకు సాగడానికి సమాయత్తం చేస్తాయి. అన్యాయాన్ని నిలదీస్తాయి. సమానత్వాన్ని సాధించడానికి దోహదం చేస్తాయి. నిరంతరం చైతన్యంతో ఉన్నప్పుడు ఉద్యమాల అవసరం ఏర్పడదు. 1956లో తెలంగాణను కలుపుకొని ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డప్పుడు తెలంగాణ వారి నుంచి చాలా వ్యతిరేకత వుండేది. అంతకు ముందు నుంచి కూడా చాలా వ్యతిరేకత ఉండేది. ఆ తర్వాత పదకొండేండ్లు గడచినాక 1967లో తెలంగాణ ఉద్యమం మొదలైంది. అది 1972 దాక సాగింది. తర్వాత 1993లో తిరిగి ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం మొదలైంది. ఇట్లా యాభై ఏండ్లు అన్యాయం జరిగిందని మూడు మహోద్యమాలు జరిగాయి. 1956 నవంబరు 1 తర్వాత నుంచి 1967 దాకా తెలంగాణకు ఆయా రంగాల్లో ఆర్థికంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా, ఉపాధిపరంగా, రేడియో, టీవీల పరంగా జరిగిన అన్యాయం ఒక గుట్టలా పేరుకుపోయింది. అయితే తెలంగాణలోని రచయితలు, కళాకారులు, మేధావులు తెలంగాణకు జరుగుతున్న అన్యాయాన్ని ఎలుగెత్తి చాటలేకపోయారు.

**తెలంగాణ శాసనసభ్యులు, మంత్రులు ఏం చేశారు? :**

ఏటా మార్చి నెలలో శాసనసభలో ప్రవేశపెట్టే బడ్జెట్ సందర్భంగా తెలంగాణకు జిల్లాలవారీగా శాఖలవారీగా ప్రాజెక్టులవారిగా తక్కువ బడ్జెట్ కేటాయించడం వల్ల ఎంత అన్యాయం జరుగనున్నదో హెచ్చరిస్తూ ఆనాటి తెలంగాణ శాసనసభ్యులుగానీ, జర్నలిస్టులు, రచయితలు, మేధావులు గానీ చేయాల్సినంత చేయలేకపోయారు. శాసనసభ్యులు తెలంగాణ ప్రాంత ప్రత్యేక అభివృద్ధి కోసం, ప్రత్యేక బడ్జెట్‌నుగానీ, ఉన్న బడ్జెట్‌లో జనాభా నిష్పత్తి ప్రకారం, రెవెన్యూ వసూలు నిష్పత్తి ప్రకారం 40 శాతం వాటా కోరుతూ సాధించలేకపోయారు. ఇవి జరిగి వుంటే ఆ తర్వాతి బడ్జెట్‌లోనైనా కేటాయింపుల్లో ఉపాధి అవకాశాల్లో, ప్రాజెక్టుల్లో, పాఠ్యపుస్తకాల్లో 40 శాతం తెలంగాణ వాటా తెలంగాణకు దక్కి వుండేది.

**రెండవ దఫా తెలంగాణ రాష్ట్ర ఉద్యమం :**

1967 చివరలో ప్రారంభమై 1968లో విస్తృతమై 1969 - 72 దాకా మహోద్యమంగా సాగిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ఒక మహోజ్వల చరిత్ర. 1956 నుంచి ఓపికతో వేచి వుండి ప్రజాస్వామికంగా అడిగి విసిగి పోయి1967 నుండి తెలంగాణ సమాజం తన అసంతృప్తికి ప్రతిఘటన రూపం తీసుకుంది.

అయితే ఆ మహోజ్వల చరిత్రను, అది తెచ్చిన పరిణామాలను అంపశయ్య నవీన్ వంటి ఒకరిద్దరు తప్ప తెలంగాణ మేధావులు, కళాకారులు ఏమీ పట్టించుకోకుండా కుంభకర్ణుని నిద్రతో గుర్రుకొట్టినారు. 1952లో దాశరథి కృష్ణమాచార్య అధ్యక్షులుగా, సి. నారాయణరెడ్డి కార్యదర్శిగా, వట్టికోట ఆళ్వారు స్వామి, సురవరం ప్రతాపరెడ్డి, జి. రాములు వంటివారితో ఏర్పడిన తెలంగాణ రచయితల సంఘం 1956 దాకా పని చేసింది. వాళ్లు ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి మద్దతుగా పెద్దగా రచనలు చేయలేకపోయారు.

1956కు ముందు నుంచి తెలంగాణ మహాసభ పేరుతో జె. ఈశ్వరీబాయి, కొండా లక్ష్మణ్‌బాపూజీ, అచ్యుతరెడ్డి, సిద్ధప్ప, జగదీశ్ ఆర్యా, గండయ్య, వందేమాతరం రామచంద్రరావు, వి.ఎస్.వెంకట్రావు, అరిగె రామస్వామి, మ్యాదరి బాగయ్య, ఆదయ్య...... ప్రత్యేక తెలంగాణ కోసం నిరంతరం తపిస్తూ వచ్చినారు. అచ్యుతరెడ్డి మార్గ్ పేరుతో విద్యానగర్‌లో ఒక వాడ ఉంది. ఆదయ్య పేరుతో సికింద్రాబాద్ రైల్వే స్టేషన్ పక్కన ఒక వాడ ఉంది.

కాళోజీ, దాశరథి, సోషలిస్టు నాయకుడు, మేధావి ప్రొఫెసర్ కేశవరావు జాదవ్, జయశంకర్, కె. సంజీవరావు వంటి కొందరు మాత్రం తెలంగాణ సమస్య గురించి నిరంతరం మాట్లాడుతూనే ఉన్నారు. తెలంగాణ సమాజం గానీ, తెలంగాణ రాజకీయాలు గానీ దానికంతగా స్పందించలేదు.

అలాగే టిఎన్‌జివోల సంఘం 1969లో ఏర్పడి ఇంచుమించు నిరంతరం ప్రత్యేక తెలంగాణలోనే మన సమస్యలు పరిష్కారం అవుతాయని గొంతెత్తి నినదిస్తూనే



ఉన్నది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో భాగంగా కె.ఆర్.ఆమోస్, గడ్డం సంజీవ రావు (కె), జయశంకర్, రఘువీర రావు, ఇ.వి.పద్మనాభం, పి.జె. సూరి, ఊంగం రాఘవులు, మొదలైన యువతరం ఎన్నో కష్టనష్టాల పాలైంది; ఎన్నో త్యాగాలు చేసింది. అప్పటి ఉద్యమంలో 370 మంది అమరు లయ్యారు. వేలాదిమంది విద్యార్థులు సంవత్సరాలతరబడి విద్యను కోల్పోయారు. జైళ్ళ పాలయ్యారు.

> తెలంగాణ నుండి చైనా, ఆఫ్ఘనిస్థాన్ ఉత్తర భారతదేశానికి బౌద్ధ ప్రచారంతోపాటు విద్య, వైద్య, వట్టు, నేత, ఇతర వృత్తుల నైపుణ్యం ప్రపంచంలోని పలు ప్రాంతాలకు విస్తరించింది. సింధు నాగరికత నిర్మాతల్లో తెలంగ ప్రజలు, నాగజాతి ప్రజలు, దక్షిణాది ప్రజలు ఉన్నారని చాలామంది అభిప్రాయం. హరప్పా, మొహంజోదారో, సింధు నాగరికత అవశేషాలు ఇప్పటికీ తెలంగాణ ప్రజల సంస్కృతిలో సజీవంగా ఉండడం విశేషం.

**మూడవ దఫా తెలంగాణ రాష్ట్ర ఉద్యమ ప్రారంభం ఎలా జరిగింది? :**

1984లో నాట్యకళా ప్రభాకర్ తదితరుల బృందం ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం గురించి హైదరాబాదు బసంత్ టాకీసులో సదస్సులు గోష్ఠులు నిర్వహించింది. 1987లో పి. హర్నాథ్, నాట్యకళా ప్రభాకర్, పాశం యాదగిరి మొదలైనవారు మరో సదస్సు నిర్వహించారు. పుస్తకాలు ప్రచురించి తెలంగాణకు జరుగుతున్న అన్యాయాలను ప్రజల ముందుంచింది. 1991లో నలుపు పత్రికలో ఇతర పత్రికల్లో తెలంగాణకు జరిగిన అన్యాయంపై పలు వ్యాసాలు రావడం మొదలైంది. కాకతి అనే కలం పేరుతో 'విద్య' ఉద్యోగావకాశాలు కోల్పోతున్న తెలంగాణ యువతరం' అనే పేరుతో చిన్న పుస్తకం వెలువడింది. అది సంచలనం సృష్టించింది. 1993 ఫిబ్రవరి 22, 23 తేదీల్లో ఉస్మానియా యూనివర్సిటీలో చిన్న రాష్ట్రాల ఏర్పాటు గురించి జాతీయ సదస్సు జరిగింది. దీన్ని సోషలిస్టు నాయకులు సురేంద్రమోహన్ ప్రారంభించారు. జార్జి ఫెర్నాండెజ్ మొదలైనవాళ్లు ఈ సదస్సుకు హాజరైనారు. ఇది భావజాల చర్చలో ఒక మైలురాయి. చిన్న రాష్ట్రాల ఏర్పాటు కోసం ఉద్యమిస్తున్న జార్ఖండ్ ముక్తిమోర్చా నాయకులు శిబు సోరేన్ వంటివారు తెలంగాణ మేధావులు, జర్నలిస్టులతో కలిసి చర్చించారు.

1990లో నాట్యకళా ప్రభాకర్ మా తెలంగాణ పేరుతో పత్రికను ఏడు సంచికలు వెలువరించినారు. ప్రొఫెసర్ తిప్పారెడ్డి, మధుసూదన్ రెడ్డి, హర్నాథ్, కేశవరావు జాదవ్ తెలంగాణ చర్చను మళ్లీ ముందుకు తెచ్చారు. మాజీ పార్లమెంటు సభ్యుడు మల్లికార్జున్, మాజీ ఉపముఖ్యమంత్రి సి. జగన్నాథరావు, కె. కేశవరావు, సరోజినీ పుల్లారెడ్డి మొదలైనవాళ్లు తెలంగాణ సమస్యపై చురుకుగా కదిలారు. ఇందులో మల్లిఖార్జున్ గతంలో కేంద్రమంత్రిగా ఉండడం గమనార్హం. శాసనసభ్యుడుగా ఉన్న పట్లోళ్ల ఇంద్రారెడ్డి ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం అనే నినాదంతో పార్టీని ఏర్పాటు చేసి ఆ పార్టీ తరఫున అభ్యర్థులను ఎన్నికల బరిలో దింపి ఫలితాలు పొందలేకపోయారు.

**నేటి హోంమంత్రి జానారెడ్డి తెలంగాణ కోసం :**

అంతకన్నా ముందే 1989లో తెలుగుదేశం తరఫున శాసనసభ్యుడిగా గెలిచిన కె. జానారెడ్డి ఆధ్వర్యంలో తెలంగాణ ఎమ్మెల్యేల ఫోరం ఏర్పడింది. ప్రధాని పి.వి నరసింహారావుకు తెలంగాణ రాష్ట్రం గురించి విజ్ఞాపన అందజేసారు. ఇదే జానారెడ్డి ఇప్పుడు పోలీసు శాఖ మంత్రి అయి ఆ ఊసెత్తడంలేదు. దీని గురించి బుక్‌లెట్ ప్రచురించారు. కరీంనగర్ జిల్లాకు చెందిన మాజీ శాసనసభ్యుడు వెలిచాల జగపతిరావు నీటిపారుదల ప్రాజెక్టుల గురించి వరుసగా కరపత్రాలు, పుస్తకాలు ప్రచురించారు.

కేశవరావు జాదవ్ తెలంగాణ సమస్యలపై, అంశాలపై 'ఓలింపస్' పత్రిక ప్రత్యేక సంచిక వెలువరించారు. రిటైర్డ్ చీఫ్ ఇంజనీర్ ప్రభాకర్, ఆర్. విద్యాసాగర్ రావు, వి. ప్రకాష్, నిర్మల, బేలయ్య, జగన్మోహన్, మొదలైనవాళ్లు అంకితభావంతో నీటిపారుదల ప్రాజెక్టుల గురించి తెలంగాణ ప్రజలను చైతన్యవంతులను చేసే వ్యాస పరంపరలు వెలువరిస్తున్నారు. విశాలాంధ్ర బుక్‌హౌస్‌లాగా తెలంగాణ వారి అన్ని పుస్తకాలు దొరికే, ప్రచురించే తెలంగాణ బుక్‌హౌస్ ఒకటి ఏర్పడి అన్ని జిల్లాల్లో దాని బ్రాంచీలను పెట్టాల్సి ఉన్నది.

**జర్నలిస్టులు, రచయితలు, చరిత్ర కారులు నిర్వహించిన పాత్ర:**

పలువురు పాత్రికేయులు, రీసెర్స్ స్కాలర్లు, పార్టీలతో సంబంధాలు లేనివారు స్వాతంత్ర్యానంతరం తెలంగాణ వెనుకబడటం గురించి నిరంతరం యోచిస్తూనే ఉన్నారు. ఎప్పుడు ఎవరు తెలంగాణ గురించి మాట్లాడినా మద్దతిస్తూనే ఉన్నారు. తెలంగాణ వెనుకబాటుపై ఐఎఎస్ అధికారి బి.పి.ఆర్. విఠల్ అధ్యక్షతన తయారైన అధికారిక నివేదిక నిర్లక్ష్యానికి గురైనా ఎవరూ పట్టించుకోలేదు. కృష్ణా జిల్లాలో పుట్టినప్పటికీ ఇక్కడే పెరిగి, పెద్దయిన జి. కృష్ణ తెలంగాణ గురించి ఎన్నో విషయాలను అందించారు. 'నీలగిరి' షబ్బీసు, ఆంధ్రప్రభ పి.ఎస్. స్వామి, కె.ఎల్. రెడ్డి, పాశం యాదగిరి, కె. రామచంద్రమూర్తి, టంకశాల అశోక్, జయధీర్ తిరుమలరావు, రాపోలు ఆనందభాస్కర్, సురేంద్రరాజు, పి. వేణుగోపాల స్వామి రఘురామ్, దుర్గం రవీందర్, రామకృష్ణ, మల్లేపల్లి లక్ష్మయ్య, కాసుల ప్రతాపరెడ్డి, పులుగు శ్రీనివాస్, దేవులపల్లి అమర్, కె. శ్రీనివాస్, సంగిశెట్టి శ్రీనివాస్, మురళీధర్ రావు దేశ్‌పాండే, సిహెచ్ మధు, బైస రామదాసు, బైస దేవదాసు, గడియారం శ్రీవత్స, ప్రభంజన్ యాదవ్, గుడిపాటి, పిట్టల రవీందర్ వంటి జర్నలిస్టులు బి.ఎన్. శాస్త్రి సామల సదాశివ, దాశరథి రంగాచార్య వంటి రచయితలు, ఉస్మానియా యూనివర్శిటీ ప్రొఫెసర్ పురుషోత్తమరెడ్డి, కాకతీయ యూనివర్శిటీ జనార్ధన్ రావు మొదలైనవాళ్లు తెలంగాణ ప్రత్యేకతను, సంస్కృతిని వెలికి తీసే ప్రయత్నం చేసినారు. ఇంకొందరు ఆయా ఉద్యమాలతో సంబంధం లేకుండా తెలంగాణ జాతీయత ఆధారంగా సాహిత్యాన్ని, వాదనలను ప్రచారం చేస్తూనే ఉన్నారు.



**ప్రధాని దేవెగౌడ చిన్న రాష్ట్రాల ఏర్పాటుకు ఊపిన పచ్చజెండా :**

అప్పటి ప్రధానమంత్రి దేవెగౌడ తమ ప్రభుత్వం చిన్నరాష్ట్రాల ఏర్పాటుకు సుముఖంగా ఉన్నదని 1996 ఆగస్టు 15వతేదీన స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా ఎర్రకోటపై జెండా ఎగురవేస్తూ తమ అభిప్రాయాన్ని ప్రకటించారు. ఆయనది మెజారిటీలేని ప్రభుత్వం. పైగా మన రాష్ట్రంలో తెలంగాణను వ్యతిరేకించే చంద్రబాబు బలంతో కృత్రిమ కాళ్లపై నిలబడి పనిచేసిన ప్రభుత్వం. అందుకే అప్పుడు ఆ విషయం అంతటికే పరిమితమైంది. దాంతో జాతీయోద్యమ కాలం నుంచి స్వాతంత్ర్యానంతరం కూడా ప్రాంతీయ అసమానతలకు వివక్షలకు గురైన ప్రజల హృదయాల్లో ఆశలు వెల్లివిరిసినాయి, అట్లా నాగపూర్ కేంద్రంగా విదర్భ రాష్ట్రోద్యమం, ప్రత్యేక తెలంగాణోద్యమం, వనాంచల్ ఉద్యమం కొత్త ఊపిర్లు పోసుకున్నాయి. ప్రజలు కదిలితే ప్రత్యేకరాష్ట్రం ఇప్పుడు సుళువని అందరిలో ఆశ విశ్వాసం కలిగాయి.

**రోమన్ సామ్రాజ్యంలో క్రైస్తవం నిలదొక్కుకునే క్రమంలో గణ తెగ నాయకురాళ్ళను, మహిళా వైద్యులను మంత్రగత్తెల పేరుతో ఆరులక్షల మందిని చంపివేశారు. భారతదేశంలో మాతృస్వామిక వ్యవస్థ తాలూకు వీరి ఆనవాళ్ళు మైసమ్మ, పోచమ్మ, ఎల్లమ్మ మొ॥ అమ్మదేవతలు, గ్రామదేవతలు పేరుతో నిలిచిపోయారు. వీరు సుమేరియన్ నాగరికతను, సింధు నాగరికతను నిర్మించిన మహిళలు.**

**దేవెగౌడ ప్రకటన తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో ఒక మైలురాయి :**

చిన్న రాష్ట్రాల ఉద్యమంలో దేవెగౌడ ప్రకటన ఒక మైలురాయి. నవంబరు 1,1996 రోజున తెలంగాణ మహాసభ వరంగల్లులో భూపతి కృష్ణమూర్తి, కాళోజీ, జస్టిస్ మాధవరెడ్డి, నాళం కృష్ణారావు (ఇంజనీరు), మొదలైనవారు నిర్వహించారు. ఈ మహాసభ తెలంగాణ ఉద్యమాన్ని పునరుజ్జీవింపజేయటంలో ఒక మలుపు. 1994లో తెలంగాణ లిబరేషన్ స్టూడెంట్ ఆర్గనైజేషన్ ఆధ్వర్యంలో ఆంధ్ర ప్రాంతం నుంచి హైదరాబాదులోని ప్రయివేటు కాలేజీలకు 112 మంది లెక్చరర్లను బదిలీ చేయడానికి వ్యతిరేకంగా ఉద్యమించింది.

**గాదె ఇన్నయ్య, పాశం యాదగిరి కృషి :**

హైదరాబాదులోని వి.వి. కాలేజీలో 1996లో ఫోరం ఫర్ ఫ్రీడమ్ ఆఫ్ ఎక్స్‌ప్రెషన్ అనే సంస్థ తెలంగాణ సదస్సు జరిగింది. పాశం యాదగిరి, మొదలైన జర్నలిస్టుల సహకారంతో గాదె ఇన్నయ్య రాసిన 'దగా పడ్డ తెలంగాణ' పుస్తకం వి.వి. కాలేజీ సదస్సులో ఆవిష్కరింపబడింది. (ఈ ఇన్నయ్య తర్వాత బాంబులకేసులో ఇటీవల అరెస్ట్ కావడం తెరాస నుండి విడిపోవడంలాంటి సంఘటనలు జరిగాయి.) ఈ సదస్సులోనే తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే దళితులకు చేకూరే ప్రయోజనాలేమిటనే ప్రశ్న కంచె ఐలయ్య లేవనెత్తారు. నల్లగొండ జిల్లా భోనగిరిలో, ఆ తర్వాత వరంగల్లులో పెద్ద యెత్తున సదస్సులు జరిగినాయి. ప్రజా వాగ్గేయకారుడు గద్దర్ తన గళాన్ని,

ప్రజాకర్షణను తెలంగాణ సమస్యకు అంకితం చేసినారు. భోనగిరిలో జరిగిన తెలంగాణ సదస్సుకు గద్దర్ గళాన్ని అందించడంతో దానికి కొత్త స్వభావం చేకూరింది. వరంగల్లు సదస్సులో తెలంగాణ జిల్లాల నుంచి వచ్చిన మేధావులు, ఉపాధ్యాయ వర్గాలు తెలంగాణ సమస్యను ప్రజల్లోకి తీసుకెళ్లడానికి గళాలు విప్పారు.

**రాపోలు ఆనంద భాస్కర్ - తెలంగాణ ప్రగతి వేదిక కృషి:**

తెలంగాణ ప్రగతి వేదిక ఈ ప్రాంతంలో 1997నుంచి భావజాల వ్యాప్తికి భూమిక. రాపోలు ఆనంద భాస్కర్ నేతృత్వంలో హైదరాబాద్‌లో జరిపిన రెండు రోజుల తెలంగాణ సింహావలోకన శిబిరం వినూత్నమయిన ఫలితాలను సాధించింది. తెలంగాణ ప్రగతి వేదిక ఆవిర్భావం గురించి తెలంగాణలోని అన్ని జిల్లాల్లో ప్రముఖ పట్టణాల్లో ఒకేసారి ఒకేరోజు ఒకే సమయానికి విలేకరుల సమావేశం నిర్వహించడం ద్వారా తెలంగాణ భావ వ్యాప్తికి ప్రతికూలంగా ఉన్న వివిధ దిన పత్రికల ఎత్తుగడను ఎదుర్కోగలిగారు. ఈ ప్రాంత బతకమ్మ పండుగ కాలాన్ని తెలంగాణ సంస్కృతి పరిరక్షణ దినోత్సవాలుగా ప్రకటించి, పలుచోట్ల అవగాహన కార్యక్రమాలు నిర్వహించిన ఘనత తెలంగాణ ప్రగతి వేదికది. ఈ ప్రాంత తాగు నీటి, సాగునీటి సమస్యల మీద మేధావులను, శాస్త్రవేతలను సమీకరించి సదస్సులు నిర్వహించింది. తెలంగాణ ప్రగతి వేదిక అందించిన సంకేతంతో విస్తారంగా చర్చలు జరిగాయి. రెండో దశగా తెలంగాణ ప్రగతి వేదిక ప్రజానీకంలో అవగాహన పెంచే భారం స్వీకరించి, మహబూబ్ నగర్, వరంగల్, పెద్దపల్లి, సూర్యాపేట, సిద్దిపేట, దుబ్బాక, సంగారెడ్డి, మంచిర్యాల, నిర్మల్, నిజామాబాద్ తదితర పట్టణాల్లో సభలు నిర్వహించింది.

**దళిత బహుజన, పీడీఎస్‌యూ వీరయ్య కృషి :**

తెలంగాణ రాష్ట్ర ఉద్యమం కోసం పిడియస్‌యు వీరయ్య చేసిన కృషి చాలా ఉంది. పిడియస్‌యు వీరయ్య కులసమస్యపై జనశక్తి పార్టీలో 1992 నుంచి అంతర్గత చర్చ ప్రారంభించారు. మహాత్మా జ్యోతిబాపూలేను జాతీయ విప్లవకారుడిగా గుర్తిస్తూ వ్యాసాలు వ్రాసారు. అనంతపురంలో రాష్ట్రస్థాయి సదస్సు నిర్వహించారు. దీంతో పాటు తెలంగాణ వెనుకబాటు సమస్యను, ఫెమినిస్టు సమస్యను కూడా పట్టించుకోవలసి ఉన్నదని అధ్యయనం చేసి తెలంగాణ ఉద్యమం వైపు మొగ్గు చూపారు. జనశక్తి రాజన్న గ్రూపు ఒక పార్టీగా తెలంగాణ రాష్ట్రంపై సానుకూలంగా స్పందించడంలో వీరయ్య పాత్ర ప్రముఖమైనది. అటు తర్వాత కుల సమస్యపై తెలంగాణ సమస్యపై పార్టీ నుంచి విడిపోయి వీరయ్య తెలంగాణ మహాసభ ఉద్యమంలో క్రియాశీలక పాత్ర నిర్వహించారు. తెలంగాణ మహాసభ పత్రికను ప్రచురించారు. సూర్యాపేటలో వేలాది మందితో గొప్ప సదస్సు జరిపారు. చెరుకు సుధాకర్, వి. ప్రకాశ్ తెలంగాణ మహాసభ నిర్వహణలో ముఖ్యభూమిక పోషించినారు. అప్పటి దాకా ముప్పయి నాలుగు సంఘాలుగా తెలంగాణ గురించి పని చేస్తున్న సంస్థలకు వీరయ్య నాయకత్వంలో



పెట్టిన మహాసభ ఒక దిక్సూచి అయింది. ఎందుకో గాని వీరయ్య తిరిగి సాయుధ పోరాట పంథాతో పార్టీని స్థాపించి తర్వాత అమరులయ్యారు.

**ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం కోసం ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థుల కృషి :**

16,17 ఆగస్టు 1997లో ఉస్మానియా యూనివర్సిటీ లో 'ప్రాంతీయ అసమానతలు - అభివృద్ధి ప్రత్యామ్నాయాలు' అనే అంశంపై పి.ఎల్. విశ్వేశ్వరరావు, సింహాద్రి, అఖిలేశ్వరి మొదలైనవారి చొరవతో జాతీయ సదస్సు జరిగింది. పలు రాష్ట్రాల నుంచి ఈ సదస్సులో పత్రాలు సమర్పించారు. వాటిని ఇంగ్లీషులో తెలుగులో పుస్తకాలుగా వెలువరించారు. ఇవి తెలంగాణ ఉద్యమానికి గొప్ప సైద్ధాంతిక మద్దతును అందించాయి. అమెరికాలోని తెలంగాణ బుద్ధిజీవులు తెలంగాణ డెవలప్‌మెంట్ ఫోరమ్‌ను ఏర్పాటు చేసి వెబ్‌సైట్‌ను రూపొందించారు. తెలంగాణకు జరుగుతున్న అన్యాయంపై అక్కడ చర్చాగోష్ఠులు నిర్వహిస్తున్నారు. ఉద్యమానికి పలురకాలుగా మద్దతు తెలుపుతూనే ఉన్నారు.

> నాగజాతి ప్రశస్తి ప్రపంచవ్యాప్తమైంది. ఆర్యులు, శివుడు, విష్ణువు, నాగుపాము, క్రైస్తవ మతంలోని పాము, మహాభారతంలోని జనమే జయుని సర్పయాగం అష్టనిస్థాన్ ప్రాంతంలోని నాగజాతి తెలంగాణ ప్రజలను మట్టుపెట్టడానికి సంబంధించిన కథను సూచిస్తుంది. ఏనుగును మచ్చిక చేసుకున్న నాగజాతులను కలుపుకు పోవడానికి చేసిన ప్రయత్నం వినాయకుడి ఏనుగుతల సూచిస్తుంది.

**ఎక్కడికక్కడ తెలంగాణలో సదస్సులు, సభలు నిర్వహించిన 36 సంస్థలు :**

ఇలా తెలంగాణ జిల్లాల్లో ఎక్కడికక్కడ ఎన్నో సదస్సులు నిర్వహించబడినాయి. రాపోలు ఆనందభాస్కర్, నేను, ఇంజనీరు ప్రభాకర్, ప్రొఫెసర్ కె. శ్రీనివాసులు, ప్రొఫెసర్ వెంకటనారాయణ, కొరివి వేణుగోపాల్, బాస రాజేశ్వర్... మొదలైనవాళ్లు తెలంగాణ గురించి ఎన్నో వ్యాసాలు, పుస్తకాలు వ్రాసారు. సభలు, సదస్సులు నిర్వహించారు. 36 సంస్థలు ఎక్కడికక్కడ వెలిసాయి. అవన్నీ కలిసి ఐక్య సంఘటన కట్టాయి.

**ప్రపంచంలోని 100 దేశాల కన్నా తెలంగాణ పెద్దది :**

సామాజిక ఉద్యమంగా నడిపినంత కాలం తెలంగాణ రాష్ట్ర ఉద్యమానికి బ్రిటిషాంధ్ర పట్ల విద్వేషం అనే లింక్‌ను తొలగించడం జరిగింది. తెలంగాణ ప్రాంతం ప్రపంచంలోని వంద దేశాల కన్నా పెద్దదని, దేశంలోని 15 రాష్ట్రాల కన్నా పెద్దదని, కోస్తాంధ్ర బహుజన ప్రజలతో వైరుధ్యం లేదని, పరస్పరం సహకరించుకుని రెండు రాష్ట్రాలుగా ఏర్పడడం వల్ల పరస్పరం ప్రయోజనం పొందవచ్చునని అర్థం చేయించడం జరిగింది. అట్లా వారిలో చిన్న రాష్ట్రాల ఆవశ్యకత పేరుతో పరస్పరం ప్రేమించుకొని, గౌరవించుకొనే పద్ధతిలో తెలంగాణ ఒక చిన్న రాష్ట్రంగా ఏర్పడాలనే వాతావరణం కలిగించారు. ఇందుకు దళితవాద, స్త్రీవాద ఉద్యమాలు ఆయా కులాల రాష్ట్రస్థాయి

సంఘాలు సహృదయతతో సమస్యను అర్థం చేసుకొని పాలకవర్గాల దోపిడీ పీడనలకు ప్రతిగా మొత్తం కోస్తాంధ్ర ప్రజలను ద్వేషించనవసరం లేదనే స్పష్టత కలిగి వుండింది. వివిధ నక్సలైట్ గ్రూపుల విప్లవ వాతావరణం కూడా ఆంధ్రా తెలంగాణ ప్రజల మధ్య ప్రేమను, స్నేహాన్ని కొనసాగించడానికి ఎంతగానో సహకరించింది.

**తెలంగాణలో ఎదిగిన కొత్త సామాజిక శక్తులు:**

కొత్తగా ఎదుగుతున్న సామాజిక శక్తులు కుల సమస్యను, తెలంగాణ సమస్యను, దళిత సమస్యను, స్త్రీ సమస్యను తీసుకొని మొత్తం సమాజానికి నాయకత్వం వహించే క్రమంలోకి ఎదిగాయి. అలా ఎదుగుతున్న శక్తులు గ్రూపులుగా, సంస్థలుగా సదస్సులుగా తమకు తాము సమీకరించుకున్నాయి. (ఇవి అలాగే ఎదిగి వుంటే తెలంగాణ నుంచి ఒక మహోన్నతమైన, మహత్తరమైన గొప్ప యువనాయకత్వం వందలు వేలుగా ఎదిగి వుండేది.) కొన్ని వందల సెమినార్లు విద్యార్థి యువజన ఉద్యోగ ఉపాధ్యాయ శ్రేణులను సమీకరించి జిల్లా స్థాయిలో, తాలూకా స్థాయిల్లో నిర్వహించారు. బహుజన చైతన్యం వెల్లివిరిసి వుండడం వల్ల జిల్లా గ్రామీణ స్థాయిల్లో తెలంగాణ ఉద్యమ నాయకత్వం ఎట్లా వుండాలి, ఎవరుండాలి అన్న చర్చ చాలా తీవ్రంగా సాగింది. సంఘాల మధ్య అనైక్యత పరిమిత లక్ష్యాలవల్ల వీరు మరింత ముందుకు బలంగా రాలేకపోయారు.

**తెలంగాణ జాతీయోద్యమంలో కులసమస్య, నాయకత్వ సమస్య :**

జాతీయోద్యమ కాలంలో గాంధీ కూడా అంబేద్కర్‌తో ఇలాగే అన్నాడని అయితే స్వాతంత్ర్యం వస్తే దళితులకు వుండే వాటా ఏమిటో ఇప్పుడే స్పష్టం కావాలని నిలదీసి సాధించుకోవడం వల్లనే అవి రిజర్వేషన్లుగా, హక్కులుగా, రాజ్యాంగంలో పొందుపర్చబడ్డాయి. కానీ అదే సమయంలో గాంధీజీ, నెహ్రూ నాయకత్వాన్ని నమ్మి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత బిసిలకు ఎస్‌సిలకు లాగే రిజర్వేషన్లు ఇస్తామని, ఇచ్చిన హామీని నమ్మి వారికి అనుచరులుగా మారడం వల్ల స్వాతంత్ర్యం వచ్చి యాభై నాలుగేళ్లయినప్పటికీ కూడా ఎస్‌సి, ఎస్‌టిలకు లాగా బిసిలకు అన్ని రంగాల్లో రిజర్వేషన్లు అమలు కాకుండా పోయాయి. యాభై నాలుగేళ్ల స్వాతంత్ర్యం తర్వాత కూడా 82 బిసి కులాలు శాసనసభ గడప తొక్కలేకపోయాయంటే వీరు ఎంత వెనకబడి ఉన్నారో అర్థం చేసుకోవచ్చు. ఇక దొమ్మరి, డక్కలి, గోండుల లాంటివారి సంగతి చెప్పనక్కరలేదు.

**బీసీ, ఎస్సీ, ఎస్టీ నాయకత్వ సమస్యను వదిలేసిన క్రమం :**

అందువల్ల తెలంగాణ వచ్చిన తర్వాత కాదు, తెలంగాణ రావడం కోసం కృషి చేసే క్రమంలోనే బిసి, ఎస్‌సి, ఎస్‌టి నాయకత్వం ఎదగాలనే దాని పట్ల స్పష్టత ఉండాలని యువతరం శక్తులు నిలదీసాయి. ఇది నిజమైన సమస్య. మెజారిటీ ప్రజల సమస్య. ఈ సమస్యను ఎప్పటికీ దృష్టిలో వుంచుకోవలసివుంది. కొంతకాలం సమిష్టి కృషి కొరవడి ఒక ఉమ్మడి ఉత్తేజాన్ని సమాజానికి అందించ లేకపోయింది.



**విప్లవ గ్రూపుల పదజాలం :**

ఈ దశలో కొన్ని విప్లవ గ్రూపులు తమ నిర్బంధాలను సడలించుకోవడానికి తమ వెంట ఉన్న ప్రజలను కాస్తా కదలించుకోవడానికి పనికొస్తుందని ఆలోచించి, చర్చించి ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును సమర్థిస్తూ తీర్మానాలు చేసాయి. కానీ 34 సంస్థలకు తోడుగా తమకు తామే తెలంగాణ జనసభ వంటి కొన్ని సంస్థలను ఏర్పాటు చేసి, ఆకుల భూమయ్య లాంటివాళ్లు తామే అసలైన తెలంగాణవాదులుగా ప్రజాస్వామిక తెలంగాణ కావాలని మిగతావాళ్లందరిని విమర్శించడం ప్రారంభించారు. కానీ, నిజానికి వాళ్ళే తెలంగాణ చైతన్యాన్ని పక్కదారి పట్టించారు అనే విషయాన్ని చర్చకు రాకుండా చేశారు. దీన్ని అర్థం చేసుకోవడం అవసరం.

**శివుడు మొదట నాగజాతి ప్రజల నుండి మాతృస్వామ్య వ్యవస్థ నుండి పురుషాధిపత్య వ్యవస్థకు మారుతున్న క్రమానికి చెందిన నాయకుడై వుండాలి. కాలక్రమంలో మహాశక్తిని అతనికి దాసోహం అన్నట్లుగా చిత్రించి జరిగివుండాలి. తోలు బట్టల శివుడు వేట కాలంనాటి మానవ సమాజానికి ప్రతీక. రాతియుగం నుండి బల్లెం వాడే క్రమానికి మారిన పరిణామమే శివుడి త్రిశూలం.**

**ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని పక్కదారి పట్టించిన కోస్తా నక్సలైట్ నాయకులు :**

గతంలో 1967 నుండి 72 వరకు తెలంగాణ ఉద్యమం సాగింది. ఇది బ్రిటిషాంధ్ర ప్రాంత రాజకీయ నాయకత్వానికి వ్యతిరేకంగా చేసిన పోరాటం. ఆ సమయంలో తెలంగాణ ప్రజల దృష్టిని కోస్తాంధ్రపట్ల ద్వేషాన్ని, కోపాన్ని దృష్టి మరల్చి, వారి చైతన్యాన్ని మరల్చి తెలంగాణ ప్రాంతంలో ఒకరినొకరు చంపుకునే విధంగా యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చే వ్యూహంలో భాగంగా తెలంగాణ భూస్వాములకు రైతు కూలీలకు మధ్య పోరాటం పేరిట తెలంగాణ రాష్ట్ర సమస్యని పక్కదారి పట్టించారని కొందరు చరిత్రకారులు అంటున్నారు. ఈ విషయాన్ని అన్ని కోణాల్లో పరిశీలించడం అవసరం. నక్సలైట్ల ఉద్యమం తెలంగాణ ప్రాంతానికి విద్యారంగంలో, ఉద్యోగరంగంలో, బడ్జెట్‌ల రంగంలో జరుగుతున్న అన్యాయాల్ని ఏటా బడ్జెట్ రూపకల్పన సందర్భంగానైనా వారి పత్రికల్లోగాని, పుస్తకాల్లోగాని, ప్రసంగాల్లోగాని చర్చించలేదు. ప్రజలని ఈ విషయంలో చైతన్యపరచలేదు. అందువల్ల కోస్తాంధ్ర నక్సలైట్ నాయకత్వం ప్రత్యేక తెలంగాణోద్యమాన్ని పక్కదారి పట్టించినట్టైంది.

**కమ్యూనిస్టులు, విప్లవ పార్టీలు తెలంగాణ ప్రజలకు క్షమాపణ చెప్పాలి :**

తెలంగాణ ప్రజల రక్తమాంసాలతో, త్యాగాలతో, వీరోచిత పోరాటాలతో ఎదిగిన కమ్యూనిస్టు పార్టీలు బ్రిటీషాంధ్ర ప్రాంత నాయకుల నాయకత్వంవల్ల తెలంగాణ ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకంగా గత 50 ఏళ్ళుగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును వ్యతిరేకిస్తూ వస్తున్నారు.

కమ్యూనిస్టు, మార్క్సిస్టు పార్టీల్లోని తెలంగాణ నాయకులు, కార్యకర్తలు ఈ

మోసాన్ని గ్రహించలేకపోతున్నారు. ఆ పార్టీలలోని ఒక కులానికి చెందిన నాయకులే దీన్ని వ్యతిరేకిస్తున్నారు. ఈ విషయాన్ని ఆ పార్టీలోని తెలంగాణవారు గుర్తించాలి. నక్సలిజం పేరిట 1969 నుంచి తెలంగాణ ప్రాంతంలో పని చేస్తున్న విప్లవ పార్టీలు తెలంగాణ యువతరం యొక్క మేధోతరం జవజీవాలను తనశక్తిగా మార్చుకున్నాయి.

ఇలా విప్లవ సంస్థల ప్రభావంలోకి వచ్చినప్పుడు వాళ్లు 1969 నుంచి 1997 దాకా తెలంగాణకు అన్యాయం జరుగుతున్నదని గానీ, ప్రత్యేక రాష్ట్రం కావాలని గానీ ఎన్నడూ పార్టీలో అంతర్గతంగా గానీ, బహిరంగంగా గానీ వ్యాసాలు, చర్చలు, ప్రసంగాలు, పుస్తకాలు ప్రచురించలేదు. అందువల్ల తెలంగాణ ప్రజలకు కమ్యూనిస్టులు, నక్సలైట్లు తాము చేసిన చారిత్రక తప్పిదాలకు క్షమాపణ చెప్పాలని కొందరు చరిత్రకారులు, ఉద్యమకారులు కోరుతున్నారు. ఈ విషయంపై లోతుగా అధ్యయనం చేయడం తెలంగాణ ప్రజల చారిత్రక కర్తవ్యం. ఇలా మొత్తం మేధోరంగాన్ని తమ ప్రభావంలోకి తెచ్చుకున్న విప్లవ పార్టీలు 25 యేళ్లు తెలంగాణ ప్రత్యేక సమస్యల ఊసెత్తకుండా అందరి కన్నా ఆలస్యంగా నిద్ర లేచి ఇప్పుడు మేమే ముందున్నాం అంటున్నారు.

**తెలంగాణ చరిత్రను తిరగరాస్తున్న యువతరం:**

ఇటీవల ఈ విషయాలు ఉస్మానియా యూనివర్సిటీ జాతీయ సెమినార్లలోను, తెలంగాణ సాంస్కృతిక వేదికలోను, గాదె ఇన్నయ్య నాయకత్వంలోని సంస్థలలోను తీవ్రంగా చర్చలు జరిగాయి. ఈ నేపథ్యంలో సింహాద్రి, విశ్వేశ్వర్రావు, కాకతి పేరుతో జగన్, కె. శ్రీనివాస్, అంబటి సురేంద్రరాజు, కాసుల ప్రతాపరెడ్డి, కె.పి. అశోక్‌కుమార్, గుడిపాటి, సంగిశెట్టి శ్రీనివాస్, పత్తిపాక మోహన్, సందినేని రవీందర్, గోపగారి రవీందర్, మల్లేపల్లి లక్ష్మయ్య, జూలూరి గౌరీశంకర్ మొదలైనవాళ్లు తెలంగాణ చరిత్రను, సాహిత్య విమర్శను తెలంగాణ ప్రత్యేక అస్తిత్వాన్ని నిర్ధారిస్తూ సుసంపన్నం చేస్తున్నారు.

**వచన కవిత్వంలో తెలంగాణ :**

వచన కవిత్వంలో తెలంగాణ ఈసారి నాలుగైదు దీర్ఘకవితలను అందించింది. 'నా తెలంగాణ', ఎం. వెంకట్ 'వర్జి', సుంకిరెడ్డి నారాయణ రెడ్డి 'దాలి', అల్లం నారాయణ 'యాది – మనాది', గ్యార యాదయ్య 'ఎర్కోషి', కాసుల ప్రతాప రెడ్డి 'గుక్క' దీర్ఘ కవితలు తెలంగాణ భాషను, అభివ్యక్తిని అద్భుతంగా ఆవిష్కరించాయి. జూకంటి జగన్నాథం పాతాళగరిగె, ఇండియా ప్రైవేట్ లిమిటెడ్, గంగడోలు, వాస్కోడిగామా డాట్ కామ్,... కవితా సంపుటాలను ప్రచురించారు. కొన్ని కథలు కూడా వ్రాసారు.

**పాటల్లో తెలంగాణ :**

సుమారుగా 500 పాటలు తెలంగాణ రాష్ట్రాన్ని గానం చేస్తూ వెలువడ్డాయి. 1967-72 మధ్య జరిగిన తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో సీనియర్ తెలంగాణ



**అంత్రోపాలజీ ప్రకారం చూస్తే తెలంగాణకు యాభై వేల ఏళ్ల చరిత్ర ఉంది. ఆదిమానవుల జాడలు మొదలుకొని పాతరాతి యుగం, కొత్త రాతియుగం, లోహయుగం ఆధారాలు లభించిన ప్రాంతం ఇది. సింగరేణి బొగ్గు గనుల తవ్వకంలోనూ ఇతరత్రా లక్షలు యేళ్ల నాటి శిలాజాలు లభ్యమయ్యాయి. మౌలికంగా తెలంగాణ పూర్వీకులు నాగజాతికి చెందినవారు.**

రచయితలు పెద్దగా పాల్గొనలేదు. కానీ, 1994 నుండి మొదలైన మూడవ దఫా తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో తెలంగాణ రచయితలు, కళాకారులు, మేధావులు అందరూ గొంతెత్తి మద్దతు ఇస్తున్నారు. అయితే ఈ కవితల్లో, పాటల్లో, 70 శాతం ఉన్న దళిత బహుజనుల గురించిగానీ, వారు ఎదుర్కుంటున్న కులసమస్యను గురించిగానీ, వారి నాయకత్వం ఎదగాల్సిన అవసరం గురించిగానీ, తెలంగాణ వీరికే అవసరమనిగానీ పెద్దగా చెప్పలేకపోయారు. అనగా, దోపిడీ కులాల నాయకత్వ భావజాల పరిమితులకు లోనై సాహిత్య సృజన చేస్తున్నారు. దెంచనాల శ్రీనివాస్ వంటి కొందరు దీనిగురించి పట్టించుకున్నా, రాస్తున్నవారిలో ఎక్కువమంది దళిత బహుజనులే అయినా తమ ప్రజల గురించి, వారి నాయకత్వం గురించి చెప్పలేకపోవడం చాలా ఆందోళన కలిగించే విషయం.

**తెలుగు సాహిత్యంలో ముందున్న తెలంగాణ కథ, నవల**

పాటలతో పాటు మరోవేపు తెలంగాణ ప్రాంతం నుండి వందలాది కథలు, ఎన్నో నవలలు తెలంగాణ భాషలో వెలువడుతున్నాయి. తెలుగు సాహిత్యంలో గత 15 సంవత్సరాలుగా తెలంగాణ కథ, నవల సమున్నతంగా ఎదుగుతూ వస్తున్నది. స్త్రీ వాదాన్ని, దళిత వాదాన్ని తెలంగాణ సంస్కృతిని, భాషను సమన్వయించు కుని తెలంగాణ కథ, నవల ఉన్నతంగా ఎదుగుతున్నది. వేముల ఎల్లయ్య, స్కైబాబా, కాలువ మల్లయ్య, పెద్దింటి అశోక్ కుమార్, కె.వి. నరేందర్, నల్లాల లక్ష్మీరాజం, బెజ్జారపు వినోద్‌కుమార్ మొదలుకుని సీనియర్ రచయితలైన బోయ జంగయ్య, బి.ఎస్.రాములు, అంపశయ్య నవీన్, దాశరథి రంగాచార్య, ముదిగంటి సుజాతరెడ్డి, మొదలైనవాళ్ళు ఒక చారిత్రక కర్తవ్యంగా రచనలు చేస్తున్నారు. తెలంగాణ భాష మీడియాభాషగా ఆలస్యంగానైనా రూపుదిద్దు కుంటున్నది.

**తెలంగాణ నుండి వందకుపైగా పుస్తకాలు :**

ఇదంతా ఒక గొప్ప పరిణామం. 1956 నాటి ఉద్యమంలో గానీ 1968 నాటి ఉద్యమంలో గానీ లేని గొప్ప గుణాత్మకమైన పరిణామం. వెనుకటిలా అప్పుడప్పుడు నిద్రలేచి అరిచే ఉద్యమంగా కాకుండా నిరంతరం నిలదీసి సాధించుకునే నిత్యచైతన్యంగా ఎదుగుతూ వస్తున్నది. గత కొన్ని యేళ్లలో తెలంగాణ నుంచి వందకు పైగా గ్రంథాలు వెలువడ్డాయి. వాటిలో తెలంగాణ చరిత్ర, సంస్కృతి, భాష, తెలంగాణ రాజకీయాలు తలెత్తుకొని ఆత్మవిశ్వాసంతో సగర్వంగా నిలబడ్డాయి. అలా ఇవాళ

తెలంగాణ మధ్యతరగతి తామే మర్చిపోయిన తమ మాతృభాషను తిరిగి గొప్పగా భావించుకోవడం మొదలైంది. ఈ గొప్పను గుర్తు చేయడంలో రచయితలు, ఉద్యమకారులు చేసిన కృషి గుర్తించదగినది.

**దరకమే ఐక్య వేదిక ఆవిర్భావం :**

1991 నుంచి ఆంధ్రప్రదేశ్ దళిత రచయితల కళాకారుల మేధావుల ఐక్య వేదిక, దళిత కళామండలి తెలంగాణ భాషకు తెలంగాణ బహుజనుల జీవితాలకు అక్షర రూపం ఇస్తూ రాష్ట్రమంతటా ఒక గొప్ప ప్రభంజనాన్ని సృష్టించింది. అందులో భాగంగా తెలంగాణ మాతృభాష కూడా ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగింది. దరకమే ఐక్య వేదిక నిర్మాతల్లో తెలంగాణకు చెందిన బి.ఎస్.రాములు, మాష్టార్జీ, నారగోని, కంచ ఐలయ్యతో పాటు దాన్ని అందిపుచ్చుకున్న కె.సీతారాములు, ననుమాసస్వామి, కె.రామలక్ష్మణ్ మొదలైనవాళ్ళు తెలంగాణ ప్రాంతం నుండి వచ్చినవారే. దరకమే ఐక్యవేదిక తెలంగాణ బహుజన భాషా సంస్కృతి చరిత్ర పట్ల ఒక కొత్త దృక్పథాన్ని అందించి ప్రాచుర్యం లోకి తెచ్చింది. దీని నుంచి అరసం, విరసం, జనసాహితి, జననాట్య మండలి, అరుణోదయ ప్రజానాట్య మండలి వంటి సంస్థలు ఎంతో స్ఫూర్తిని పొందాయి. మాదిగ దండోరా కూడా దరకమే ఐక్యవేదిక ఇచ్చిన సిద్ధాంత స్ఫూర్తితోనే ఆవిర్భవించి ముందుకు సాగింది.

**దరకమే ఐక్యవేదిక ఇచ్చిన స్ఫూర్తి :**

మాదిగ దండోరా ఉద్యమం దీనికి తనకు తెలియకుండానే ఓ గొప్ప భూమికను ఏర్పరిచింది. మందకృష్ణ మాదిగ, కృపాకర్ మాదిగ వంటి పేర్ల ద్వారా మాదిగ అనే పదాన్ని ఆత్మవిశ్వాస ప్రకటనగా మార్చిన క్రమమే తెలంగాణ బహుజన ప్రజల్లో తెలంగాణ మాతృభాషను ఆత్మవిశ్వాసంతో పత్రికా భాషగా మార్చుకునే పరిణామానికి దోహదం చేసింది. పర్యవసానంగా తెలంగాణ భాషను దాని గొప్పతనాన్ని అద్భుతంగా సిద్ధాంతీకరించారు; చిత్రీకరించారు. తెలంగాణ సాంస్కృతిక వేదిక, మాదిగ దండోరా ఉద్యమం నుంచి స్ఫూర్తి పొంది రాష్ట్రంలో పలు బిసి, ఎస్సీ, ఎస్టీ కులసంఘాలు కొత్త నాయకత్వంలో కొత్త చూపుతో ఉద్యమాలుగా కదులుతున్నాయి. సహజంగా వీరంతా కోస్తాంధ్ర భాషలో కాకుండా తెలంగాణ భాష లోనే భావవ్యక్తీకరణ చేస్తున్నారు. అలా తెలంగాణ భాషకు కొన్ని దశాబ్దాల తర్వాత తెలంగాణలోనైనా సాధికారికత ఏర్పడింది. ఈ ఉధృతి ఇలాగే కొనసాగితే తెలంగాణ భాష పత్రికా భాషగా పాఠ్యపుస్తక భాషగా, రేడియో టీవీ భాషగా సినిమా భాషగా పరిణామం చెందుతున్న దనడంలో సందేహం లేదు. భోజ్‌పురిని బీహారీలు ఇలాగే వారి భాషా సొంపును నిలబెట్టుకున్నారు. గోండులు గోండు భాషను ఇలాగే నిలబెట్టుకున్నారు. చిన్న చిన్న తెగలు కూడా తమ భాషను ఇలాగే నిలబెట్టుకుంటున్నాయి.

**తెలంగాణలో బహుజన చైతన్యం :**

అయితే దోపిడీ కులాలు అన్ని సౌకర్యాలను అధికారాలను కలిగి వుండడం



వల్ల తెలంగాణ ఉద్యమంలో కూడా తమ పట్టును బిగించడం కోసం పలు ఎత్తులు వేసాయి. సాహిత్య, సాంస్కృతిక, రాజకీయ రంగాల్లో అవకాశ వాదంతో కొంత, బిసి, ఎస్.సి నాయకత్వాన్ని వెనక్కి నెట్టేసి తాను ముందుకు రావడానికి కొంత ఆలోచించి వెనుకబడిపోతున్నామని గమనించి ముందుకు కదలడం ప్రారంభించాయి. దరకమే ఐక్యవేదిక దళిత కళామండలి బహుజన సమాజ్ పార్టీ, మాదిగ దండోరా ఆయా కులసంఘాల ఉద్యమాలు తీసుకొచ్చిన చైతన్యాన్ని, నాయకత్వాన్ని వెనక్కి నెట్టి దోపిడీ కులాలు కొంత విజయం సాధించాయి. పోస్టు మాడర్నిజం, గ్లోబలైజేషన్ చర్చలపేరుతో, తెలంగాణ పేరుతో బహుజన సాహిత్యవ్యాప్తిని, నాయకత్వాన్ని అడ్డుకున్నారు. అయితే దరకమే ఐక్యవేదిక, బహుజనసమాజ్ పార్టీ, తెలంగాణలోని బీసీ, ఎస్సీ, ఎస్టీ సంఘాలు, టిఎన్‌జీవోలు సకాలంలో సమర్థవంతంగా తెలంగాణ రాష్ట్ర ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళడానికి పూనుకోలేకపోయారు. వారి నాయకత్వం లేకుండా పోవడంతోపాటు బీసీ, ఎస్సీ, ఎస్టీల నాయకత్వం ఎదగకుండా పోవడానికి వారిలోపం కూడా ఉంది. అందువల్ల వాళ్ళు చరిత్రకు, ప్రజాచైతన్యానికి, సామాజిక పరిణామాలకు వెనుకబడిపోయారు. నాయకత్వం మరికొన్ని కులాల చేతుల్లోకి పోవడానికి కారకులయ్యారు.

**తొలి పాతరాతియుగం**
**బుద్ధునికి పూర్వం 1,50,000 నుండి 50,000 వరకు**
**మధ్య పాత రాతియుగం**
**బుద్ధునికి పూర్వం 50,000 నుండి 30,000 వరకు**
**మళ్లీ పాతరాతియుగం క్రీ.పూ.30,000 నుండి 10,000 వరకు**
**సూక్ష్మరాతియుగం క్రీ.పూ.10,000 నుండి 3,000 వరకు**

**నక్సలైట్ల పోరాటం ఫ్రిటీషాంధ్ర వారికి వ్యతిరేకంగా కాదు :**

తెలంగాణలో నక్సలైట్లు 30 యేళ్లుగా పోరాడుతున్నది ఫ్రిటిషాంధ్ర వారికి వ్యతిరేకంగాకాదు. తెలంగాణలోని దోపిడీ కులాలకు, దోపిడీ వర్గాలకు, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా అవి పోరాడుతున్నాయి. అందువల్ల తెలంగాణ ఉద్యమానికి అవే కులాల నుంచి అవే వర్గాల నుంచి నాయకత్వం రావడం 30 యేళ్ల తెలంగాణ సామాజిక చైతన్యాన్ని వెనక్కి నెట్టేయడమే. పల్లెల నుంచి, ప్రజల నుంచి పారిపోయిన భూస్వాములను వెలమలను రెడ్లను, బ్రాహ్మణులను తెలంగాణ ఉద్యమం పేరుతో నెత్తికెక్కించుకోవడానికి చేయని ప్రయత్నం లేదు. ఇవాళ అది ఏ రూపం దాల్చిందో అందరికీ తెలుసు.

**పారిపోయిన భూస్వాములు, వెలమలు, రెడ్లు నాయకులుగా, బడా వ్యాపారులుగా ఎదిగిన క్రమం:**

1951లో తెలంగాణ సాయుధపోరాటం విరమించిన తర్వాత ఊళ్ళు వదలి పారిపోయిన భూస్వాములు దొరలు కాంగ్రెసు టోపీలు పెట్టుకొని తిరిగి గ్రామాలు

చేరి ఆస్తులు, అంతస్థులు, అధికారాలు అన్నీ కాపాడుకున్నారు, పెంచుకున్నారు. ఊళ్ళలో పట్వారీలు, పటేళ్ళు, దేశ్‌ముఖ్‌లు చివర్లో రజాకార్లు చేసిన దౌష్ట్యాలను నిజాం వంశానికి అంటగట్టారు. నిజాం రాజును ఎప్పుడు సంబోధించాల్సివచ్చినా కమ్యూనిస్టులు అతని పేరు ముందు "నిరంకుశ" అనే పదాన్ని తప్పక ఉపయోగించేవారు. నిజాంరాజ్యంలో ఒక దొర ఒక పేద వాడిని కొట్టి చంపినందుకు తనను పోలీస్‌స్టేషన్‌లో హింసించి జైల్లోవేసి కేసు పెడతారని భయపడిపోయిన ఒక దొర సంఘటనను చిల్లరదేవుళ్ళు నవలలో దాశరథి రంగాచార్య చిత్రించారు. ఆ నవలా కాలంనాడు కూడా పోలీస్ అంటే నిజాం ప్రభుత్వమంటే దొరలకు కూడా ఎంత భయమో ఈ సంఘటన స్పష్టం చేస్తుంది. కానీ కమ్యూనిస్టులు దొరలను నిజాం ప్రభుత్వాన్ని ఒకే గాటన కట్టారు. అందరి పాపాలకు నిజాం పేరును కారణంగా వాడుకున్నారు. కమ్యూనిస్టు నాయకత్వం తాలూకు కులాధిపత్యం వారి కులాల్లోని వారిని విడదీసి ఇలా వర్గీకరించడానికి సిద్ధంగా లేదని ఢిల్లీ ప్రొఫెసర్ ఇ. తిరుమలి రాసిన పి. హెచ్‌డి సిద్ధాంత గ్రంథం స్పష్టం చేస్తున్నది. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం దున్నేవాడికి భూమి అనే పేరిట దున్నించే వారికి చెందాలని కోరిందని ఆయన అందులో స్పష్టంగా భూమి పంపకాల లెక్కలతో సహా వివరించారు.

సరిగ్గా ఇలాంటి పనే ప్రత్యేక తెలంగాణ ఉద్యమ నాయకత్వం పేర ఇప్పుడు కూడా జరుగు తున్నది. పీడిత ప్రజల ఆశల తాలూకు నాయకత్వాన్ని వెనక్కినెట్టి వెలమలు, రెడ్లు, బ్రాహ్మణులు నాయకులుగా ఎదగడాన్ని ఎవరూ అడ్డుకోలేక పోయారు. విప్లవ గ్రూపులు బీసీ, ఎస్సీ ప్రజల నుంచి సామాజిక ఉద్యమ శక్తులుగా ఎదుగుతున్న యువ నాయకత్వాన్ని క్రూరంగా అణచివేసాయి. తద్వారా సామాజిక ఉద్యమంగా సాగిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమం రాజకీయ ఉద్యమంగా మారి స్వార్థపరుల చేతుల్లోకి వెళ్లడానికి అడ్డులేకుండా పోయింది. రాజకీయోద్యమంగా మారిన తర్వాత కోస్తాంధ్ర ప్రజలకు తెలంగాణ ప్రజలకు మధ్య ఉన్న ప్రేమ, ఆప్యాయతల స్థానే కులాలవారీగా ఏర్పడ్డ సఖ్యత స్థానే విద్వేషం ప్రాచుర్యంలోకి తేవడం జరిగింది. మరోవైపు విరసం వంటి సంస్థలు, దళిత మహాసభ కత్తి పద్మారావు వంటి నాయకులు కోస్తా నుంచి కూడా ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును కోరుతూ సమర్థిస్తూ వ్యాసాలు వ్రాసారు; కరపత్రాలు వేసారు. ఇదంతా బహుజన ఐక్యత వల్ల సాధ్యపడింది.

**చరిత్రను వక్రీకరించిన తెలంగాణ దోపిడీ కులాల నాయకత్వం :**

తెలంగాణ దోపిడీ కులాల వాళ్ళు కాంగ్రెస్ పేరిట, కమ్యూనిస్టు పేరిట, రాష్ట్ర చరిత్ర పేరిట తమ దుర్మార్గాల్ని, దోపిడిని తక్కువచేసి ఆ పాపాన్నంతా నైజాం రాజుకు అంటగట్టే చరిత్ర నిర్మాణ పద్ధతిని అనుసరిస్తున్నారు. ప్రపంచంలో ఏ రాజు మీదా పడనంత బురద నిజాం రాజు మీద పోయడం జరిగింది. దీన్ని బహుజనులు, పీడిత వర్గాలు జాగ్రత్తగా గమనించడం అవసరం. అందువల్ల తెలంగాణ వెలమ, రెడ్డి, బ్రాహ్మణ, దోపిడీ కులాల నాయకత్వంలో రాయబడే తెలంగాణ చరిత్ర కూడా



వారి ఆధిపత్యానికి అనువుగా వక్రీకరించ బడుతూనే ఉంటుంది. ఈ విషయంలో కింది కులాలవారు జాగ్రత్తగా ఉండవల సిందే.

**కొత్త రాతియుగం బు.పూ.3,000 నుండి 1,000 వరకు, బృహత్ శిలాయుగం బు.పూ.1,000 నుండి క్రీ.శ.200 వరకు క్రీపూ. 230 నుండి క్రీ.శ. 220 వరకు దాదాపు 450 సంవత్సరాలు శాతవాహనులు శాతవాహన రాజులు పరిపాలన. ఇంతకుముందు సామగోపుడు అతని పూర్వీకులు కోటిలింగాలను రాజధానికిగా చేసుకుని గోదావరి లోయ ప్రాంతాన్ని పాలించారు.**

**తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో దళిత బహుజన నాయకత్వం అనే చర్చ లేకుండా ఎలా పోయింది? :**

తెలంగాణ రాష్ట్ర ఉద్యమం రాజకీయోద్యమంగా మారిన తర్వాత ప్రజలకు పాలకవర్గాలకు మధ్య వుండే వైరుధ్యంగా వున్న ప్రత్యేక తెలంగాణ సమస్య బ్రిటిషాంధ్ర పాలకవర్గానికి, తెలంగాణ పాలక వర్గాలకు మధ్య సమస్యగా మారిపోయింది. తెలంగాణ ఉద్యమ డిమాండ్లు కూడా ఇందుకు అనువుగా సవరించబడ్డాయి. ఇవాళ రెండు ప్రాంతాల పరిపాలకవర్గాల మధ్య పోరాటంగా స్పష్టమైన రూపం తీసుకున్నది. ఇవాళ తెలంగాణ ఉద్యమంలో బీసీ ఎస్సీ, ఎస్టీల నాయకత్వం అనే చర్చ లేకుండానే పోయింది. వారి ప్రయోజనాలకు సంబంధించిన డిమాండ్లు వెనక్కి నెట్టేయబడ్డాయి. భూస్వాముల భూములకు నీరందడానికి నీటి సమస్యను ముందుకు తీసుకురావడం జరుగుతున్నది. కానీ అదే సమయంలో భూస్వాముల భూములు 1977నాటి ధరలకు అనగా ఎకరాకు ఐదువేల నామమాత్రపు ధరతో ప్రజలకు పంపిణీ చేయాలని గానీ చెప్పలేకపోయారు. ఇప్పుడు లక్షకు ఎకరం అమ్ముకుంటున్నారు. రెండులక్షల ఉద్యోగాలు లభించే 610 జీవోను అమలు చేయాలనిగానీ, డిమాండ్ చేయలేకపోయారు. అయినా తామే ఆ ఉద్యమానికి నారు పోసి నీరు పోసినట్లు ప్రచారం చేసుకున్నాయి. వాళ్ల మీద ఉండే నిర్బంధం తెలంగాణ కోరేవాళ్లందరి మీద పడేటట్లు చేసారు. నక్సలైట్లకు తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర సమస్య వారి అంతిమ లక్ష్యం కాదు, వారి వ్యూహంలో భాగం కూడా కాదు. వారికి అదొక ఎత్తుగడ. కార్యక్రమం, వ్యూహం, అంతిమలక్ష్యం వేరైనా వాళ్లు ఎత్తుగడ కోసం ఇలాంటి సమస్యలను తీసుకున్నప్పుడు రెంటిలో దేనికీ న్యాయం చేస్తారు?

**నక్సలైట్ల మద్దతు దేనికి పనికొచ్చిందంటే? :**

తెలంగాణ అన్నవాళ్లనల్లా లోపలేసి తోమే దుస్థితికి వారు తీసుకొచ్చారు. దీంతో విప్లవ సానుభూతి సంస్థలు తెలంగాణకు ఉద్యమ నాయకత్వం వహించడంలో విఫలమయ్యాయి. సామాజిక సంస్థలు తెలంగాణకు ఉద్యమ నాయకత్వం వహించడంలో విఫలమయ్యాయి. సామాజిక ఉద్యమాలను, ప్రజాస్వామిక ఉద్యమాలను తమ ఎత్తుగడలకు వాడుకోవడం వల్ల ఆ ఉద్యమాలు వ్యాప్తి చెందడం పోయి కుదించబడ్డాయి. అణగారిపోయాయి. అట్లా ఒక కొత్త సామాజిక శక్తుల నాయకత్వాన్ని ఈ ఎంఎల్ గ్రూపులు తొక్కిపట్టినాయి. ఈ విప్లవ పార్టీల పుణ్యాన

ఆ7 శక్తులు గిడసబారిపోయినాయి. సంఘసంస్కరణలు, స్వతంత్ర సామాజిక ఉద్యమాలు, ప్రజాస్వామిక పోరాటాలు పెను మార్పుకు మార్గం సుగమం చేస్తాయి. ఈ విషయం విప్లవ రాజకీయాలు గమనించాయో, లేదో....!

**పత్రికలు నిర్వహించిన పాత్ర :**

ఇలాంటి స్థితిలో వార్త, ప్రజాతంత్ర, గోదావరిఖని నుంచి వచ్చే చర్చ వంటి దినపత్రికలు తెలంగాణ యొక్క సమస్యలపై సంస్కృతిపై విభిన్న రూపాల్లో విశ్లేషణలను అందించాయి. లక్షలాది మధ్యతరగతిని అవి కదిలించాయి. జనంలో కదలిక ప్రారంభమైంది. 34 సంస్థల కృషి వృధా పోలేదు. అది పత్రికల వ్యాసాల రూపంలో ప్రజలను కదిలించగలిగింది. అప్పుడు సమాజంలో నిత్యజీవితంలో తెలంగాణ సమస్య తిరిగి చర్చించడం మొదలైంది. మరోవైపు బ్రిటీష్ ఆంధ్రుల యాజమాన్యంలో ఉన్న ఈనాడు, ఆంధ్రజ్యోతి, టీవీ ఛానెల్లు ఈ సమస్యను నీరుగార్చే ప్రయత్నం చేశాయి. ఉద్యోగంలేని వారి ఉద్యమం అంటూ శీర్షికలు పెట్టి ఉద్యమాన్ని అధికారంకోసం కొందరు చేస్తున్న ఎత్తుగడగా చూపించాయి.

**కొత్త తరానికి చరిత్ర అందించాలి:**

1968 – 70 లలో ప్రత్యేక తెలంగాణ కోసం ఒక గొప్ప ఉద్యమం సాగిందనే విషయం ఏ మాత్రం తెలియని సగం జనాభా పుట్టుకొచ్చింది. 1990 నుంచి ఎందరో రచయితలు కళాకారులు మేధావులు తెలంగాణ గురించి తెలంగాణ భాషలో సంస్కృతిలో మాట్లాడడం, వ్రాయడం మొదలైంది. ఈ నేపథ్యంలో నే తెలంగాణ సాంస్కృతిక వేదిక ఏర్పడింది. తెలంగాణ ప్రాంతం నుంచి ఎదిగి విశేషకృషి చేసిన పలు రంగాలవారిని సమీకరించి సత్కరించి గౌరవించింది. జొన్న రొట్టె, వట్టి చాపల పులుసు, గొంగడి సంస్కృతికి సాహిత్య గౌరవం కలిగించింది. తెలంగాణ సమస్యపై సాహిత్యరూపాలను ప్రోత్సహించింది.

**తెలంగాణ సంస్కృతిని ప్రపంచ వ్యాప్తం చేస్తున్న చిత్రకారులు :**

తెలంగాణ దృక్పథంతో, తెలంగాణ తల్లి ఎరుకతో లక్ష్మణ్‌గౌడ్, వైకుంఠం, కాపు రాజయ్య, ఏలే లక్ష్మణ్, నర్సిం, అక్బర్ వంటి చిత్రకారులు, భరత్‌భూషణ్ వంటి ఫోటోగ్రాఫర్లు తమ చిత్రాల్లో తెలంగాణ జీవితాన్ని నిక్షిప్తం చేసారు. ఎందరో వచన కవులు, పాటకవులు, జర్నలిస్టులు, కథకులు, సాహితీవేత్తలు తెలంగాణ జీవితానికి సాహిత్య గౌరవం కలిగించడం కోసం కృషి కొనసాగిస్తున్నారు. షోయబుల్లా ఖాన్, మగ్దుం మొహియుద్దీన్, కౌముది, అఫ్సర్, దిలావర్, స్కైబాబ, షాజహానా వంటి ముస్లిం రచయితలు తెలంగాణ సాహిత్యాన్ని సుసంపన్నం చేసారు. ముస్లిం సమస్యను దళిత బహుజన ఐక్యతలో భాగంగా ఎజెండాలోకి తెచ్చారు. తెలిదేవర భానుమూర్తి పలుకుబడి శీర్షికతో, పుష్పల నరసింహం 'ముద్ర' శీర్షికతో, డాక్టర్ కాలువ మల్లయ్య 'తెలంగాణ ముచ్చట్లు' పేరుతో తెలంగాణ భాషను, సంస్కృతిని, జీవితాన్ని అచ్చ తెలుగులో అందించారు. ఇలాంటి ప్రయత్నాలు తెలంగాణ అంతటా



జరిగాయి. హటన్నింటినీ వివరంగా సేకరించడం అవసరం.

బాదామి చాళుక్యులు
క్రీ.శ. 543-753
రెండవ పులకేశి
క్రీ.శ. 610-642
కుబ్జ విష్ణువర్ధనుడు
క్రీ.శ. 624
వేములవాడ చాళుక్యులు
క్రీ.శ. 750-973
వినయాదిత్య యుద్ధమల్లుడు
క్రీ.శ. 750

**కొన్ని పుస్తకాలు :**

జూలూరి గౌరీశంకర్ 'నా తెలంగాణ' దీర్ఘకావ్యంతో పాటు 'పొక్కిలి' పేరుతో తెలంగాణ కవుల సంకలనం వెలువరించినారు. కరీంనగర్ జిల్లా కథలు పేరుతో 1998లో కథాసంపుటి వెలువరించారు. 'మా కథలు ', కాలువ మల్లయ్య కథలు పేరుతో డాక్టర్ కాలువ మల్లయ్య కథా సంపుటాలను ప్రచురించారు. ఆడెపు లక్ష్మీపతి 'నాలుగు దృశ్యాలు', కె.వి. నరేందర్ 'అమ్మ', 'బురదలో జాబిల్లి', 'యుద్ధం', 'కాలుతున్న పూలతోట', 'నాన్న' కథాసంపుటాలను ప్రచురించారు. బోయ జంగయ్య 'బోజకథల'ను, వంగ నర్సయ్య 'తెలంగాణ గాథల'ను, వేముల ఎల్లయ్య 'కక్క' నవలను, అంపశయ్య నవీన్ 'కాలరేఖలు' నవలను, పి. చంద్ యాదగిరి భూనిర్వాసితులు కథల సంపుటిని, సింగరేణి పోరాటాల శేషగిరి నవలను, పెద్దింటి అశోక్ కుమార్ ఎడారి మంటలు నవలను, వలసబతుకులు, ఊటబాయి కథల సంపుటులను, నేను పాలు, స్మృతి, తేనెటీగలు, మమతలు – మానవ సంబంధాలు, వేపచెట్టు తెలంగాణ కథల సంపుటాలను ప్రచురించాను. డాక్టర్ పి. యశోదారెడ్డి ఎచ్చెమ్మకతలు, ముదిగంటి సుజాతారెడ్డి ఇసుర్రాయి, మింగుతున్న పట్నం కథా సంపుటాలను, పులుగు శ్రీనివాస్ కార్మిక కథలు, సంకరవిత్తులు కథా సంపుటాలను, అడవి తల్లి, అన్నలు నవలలను ప్రచురించారు.

**తెలంగాణ సంస్కృతి వేదిక నుండి తెలంగాణ కథావేదిక దాకా :**

'తెలంగాణ తోవలు' పేరుతో కాసుల ప్రతాపరెడ్డి తెలంగాణ అస్తిత్వ సాహిత్య, సాంస్కృతిక వ్యాసాల పుస్తకం వెలువరించారు. తెలంగాణ రాజకీయ, సాహిత్య వ్యాసాలతో కాసుల ప్రతాపరెడ్డి "భౌగోళిక సందర్భం" పుస్తకం వెలువడింది. తెలంగాణ కథా వేదిక తరఫున 'తెలంగాణ కథ – దేవులాట' అనే వ్యాసాల సంకలనం, 'చౌరస్తా' కథాసంకలనం వెలువడ్డాయి. ముదిగంటి సుజాతారెడ్డి తెలంగాణ తొలితరం కథలు పేరుతో తెలంగాణ కథలను యువతరానికి అందించారు. తెలంగాణ జర్నలిస్టుల ఫోరం తెలంగాణ జర్నలిస్టులతో జర్నలిజంపై వ్యాసాలు వ్రాయించి ఒక పుస్తకం అచ్చేసింది.

గోల్కొండ కవుల సంచిక తరువాత అంత పెద్దఎత్తున వందేళ్ళ తెలంగాణ కవుల కవితలతో "మత్తడి" పేరిట బృహత్తర కవితా సంకలనం సుంకిరెడ్డి నారాయణరెడ్డి, అంబటి సురేందర్‌రాజుగార్ల సంపాదకత్వంలో వెలువడింది. నందిని

సిధారెడ్డి, అన్నవరం దేవేందర్, దార్ల రామచంద్ర మొదలైనవారితో తెలంగాణ రచయితల వేదిక ఏర్పడింది. వేదిక తరఫున 'సోయి' అనే సాహిత్య పత్రిక వెలువడుతున్నది. స్కైబాబ, వేముల ఎల్లయ్య బృందం 'ముల్కి' పేర తెలంగాణ సాహిత్య బులిటెన్లు వెలువరిస్తున్నది. వార్త సంపాదకులుగా గిరీష్ సంఘీ, కె. రామచంద్రమూర్తి గార్ల ప్రోత్సాహం కృషి చెప్పుకోదగినది.. పాశం యాదగిరి సంపాదకత్వంలో 'తెలంగాణ రాస్తా' పత్రిక వెలువడింది. ఎ.ఎస్. పోశెట్టి తెలంగాణ చరిత్ర గురించి పుస్తకం వెలువరించారు. తెలంగాణ ఉద్యమంపై, సాహిత్యంపై, వివక్షపై పదికి పైగా విశ్వవిద్యాలయాల్లో పిహెచ్‌డిలు వచ్చాయి. సహచర బుక్‌మార్క్ నిర్వాహకుడు శంకర్ తెలంగాణ పుస్తకాలకు క్యాసెట్లకు కేంద్రబిందువు అయ్యారు.

సామాజిక, సాంస్కృతిక, భాష, జాతి ఉద్యమంగా మొదలైన తెలంగాణ ప్రత్యేక రాష్ట్రోద్యమం తెలంగాణ రాష్ట్ర సమితి ఏర్పాటయ్యాక విస్తృత ప్రజా ఉద్యమంగా మలుపు తీసుకున్నది. కె. చంద్రశేఖర్‌రావు తెలంగాణ రాష్ట్ర సమితి ఏర్పాటు చేయడంలో ఎందరో నేపథ్యంగా ఉన్నారు. బియ్యాల జనార్దనరావు, జయశంకర్, డాక్టర్ గోపీనాథ్, గాదె ఇన్నయ్య, గద్దర్ మొదలైనవారు బయటకు కన్పించే శక్తులు. ప్రపంచవ్యాప్తంగా ఉన్న తెలంగాణ వాళ్ళు ఎన్నో రకాలుగా సహకరిం చారు. తెలంగాణ రాష్ట్ర సమితి ఏర్పాటు చేయడంతోనే సీనియర్ మాజీ శాసనసభ్యులు దేశిని చినమల్లయ్య, శాసనసభ్యులు పాపారావు అటు తర్వాత పార్లమెంటు సభ్యులు ఏలె నరేంద్ర తెలంగాణ రాష్ట్ర సమితికి బలం చేకూర్చారు. ప్రజా ఉద్యమంగా జిల్లా స్థాయిలో, గ్రామ స్థాయిలో విస్తరించింది. జిల్లా పరిషత్ ఎన్నికల్లో గెలవడంతోపాటు శాసనసభ, పార్లమెంటు ఎన్నికల్లో కాంగ్రెస్‌తో పొత్తు కుదుర్చుకుని ఎన్నికల్లో గెలిచింది. ప్రజాభి ప్రాయానికి చట్టబద్ధమైన వేదికల్లో స్థానం లభించింది. అయితే రాజకీయ పార్టీగా అది రూపాంతరం చెందుతున్నకొద్దీ సామాజిక, సాంస్కృతిక, భాష, జాతి, ఉద్యమాల తాలూకు ప్రాధాన్యాలు బీసీ, ఎస్సీ, ఎస్టీల ప్రయోజనాలు వెనక్కు నెట్టివేయబడ్డాయి. అయినప్పటికీ ఒక ప్రజా ఉద్యమంగా భారత ప్రజల దృష్టిని భారతదేశంలోని పార్టీల దృష్టిని ఆకర్షించడంలో, వాటి అవగాహన మార్చడంలో తెలంగాణ రాష్ట్ర సమితి చరిత్రాత్మకమైనది.

తెలంగాణ రాష్ట్రోద్యమం రాజకీయ పార్టీ ఉద్యమంగా మారిన తరువాత ఆలస్యంగా ఆ భావజాలంలోకి వచ్చిన కారణంగానే చాలామంది రచయితలు, కవులు పాటలు, కథలు, నవలల ద్వారా తెలంగాణ మెజారిటీ ప్రజల సామాజిక పరిణామాలను, వారి డిమాండ్లను, వారి అవసరాలను, వారి నాయకత్వాన్ని, వారి ఉద్యోగాలను, వారి విద్యను డిమాండు చేయలేకపోయారు. తద్వారా డెబ్బయ్ శాతం భూస్వాముల చేతుల్లోగల భూములకు నీళ్ల కోసం నీటి సమస్యను లేవనెత్తినట్లయింది.

అయినప్పటికీ తెలంగాణ రాష్ట్ర సమితి, తెలంగాణ సాధన సమితి ఏకమైన తర్వాత కె. చంద్రశేఖరరావు నాయకత్వం స్థిరపడిన తర్వాత తెలంగాణ రాష్ట్ర ఉద్యమం



ప్రజా ఉద్యమంగా విస్తరించింది. గాంధీజీ నాయకత్వం వహించక ముందు కాంగ్రెస్ పార్టీ కొద్దిమంది మేధావుల పార్టీగా సదస్సులు, తీర్మానాలతో పరిమితమై క్లాస్ మూవ్‌మెంట్‌గా ఉండేది. గాంధీజీ నాయకత్వంలో జాతీయోద్యమం కాంగ్రెస్ పార్టీ ప్రజా ఉద్యమంగా మలుపు తిరిగింది. విస్తారంగా కోట్లాది ప్రజలను చేరి కదిలించింది. అలాగే చంద్రశేఖర్‌రావు నాయకత్వంలో ఏలె నరేంద్ర, కెప్టెన్ లక్ష్మీకాంతరావు, దేశిని చినమల్లయ్య, రేగులపాటి పాపారావు, గాదె ఇన్నయ్య మొదలైనవారి సహకారంతో తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ప్రజా ఉద్యమంగా విస్తరించింది. చంద్రశేఖరరావు ఎవరు ఎంతగా విమర్శించినా రాజనీతిజ్ఞతను ప్రదర్శించడం అతని విశిష్టతను తెలియజేస్తుంది.

**వేములవాడ చాళుక్య తొలి రాజులు : సత్యాశ్రయ రణవిక్రముడు క్రీ.శ. 641-660; పృథ్వీపతి 660-695; మహారాజు 695-725; రాజాదిత్యపృథు విక్రముడు 725-750;**
**వినయాదిత్య యుద్ధమల్లుడు క్రీ.శ. 750-775; మొదటి అరికేసరి 775-800; మొదటి నరసింహుడు 800-825; 2వ యుద్ధమల్లుడు 825-850; సొలగదండ బద్దెగుడు 850-895; 3వ యుద్ధమల్లుడు 895-915; 2వ నరసింహుడు 915-930; 2వ అరికేసరి 930-955**

తెలంగాణ అనే పదాన్ని శాసనసభలో వాడకూడదని అడ్డుకున్న చరిత్ర తెలుగుదేశం ప్రభుత్వానిది. ఆ దశనుండి ఇవాళ ఎవరూ నిరాకరించలేని విధంగా సాధికారికత పొందింది. నక్సలైట్ల పేరిట తెలంగాణ ఉద్యమాన్ని అణచడం జరగకుండా కాపాడడం చిన్న విషయం కాదు. అలాగే మన ఊళ్ళల్లోకి, ఇళ్ళల్లోకి, పొలాల్లోకి నీళ్ళొస్తున్నాయట అని తెలంగాణ పల్లెప్రజలు ఆనందించే విధంగా తెలంగాణ రాష్ట్ర నినాదం ప్రజల హృదయాల్లో కలిసిపోయింది. సామాజిక ఉద్యమాలతో పాటు రాజకీయ ఎన్నికల నినాదంగా ముందుకు తీసుకెళ్లిన టిఆర్ఎస్, కాంగ్రెస్‌లకు ఈ ఖ్యాతి దక్కుతుంది.

ఎన్నికల్లో కాంగ్రెస్, టిఆర్ఎస్, కమ్యూనిస్టు పార్టీలు సీట్ల సర్దుబాటు చేసుకోవడం ద్వారా ఐక్య సంఘటన ప్రభుత్వం ఏర్పాటు కావడానికి కృషి చేసినవారంతా ఒక చారిత్రక కర్తవ్యం నిర్వర్తించారు. ప్రజల ఆశలను, ఇచ్చిన హామీలను నెరవేర్చవలసి వుంది.

బిజెపి కేంద్ర ప్రభుత్వంలో చంద్రబాబు నాయుడు నిర్వహించిన పాత్రవలెనే చంద్రశేఖరరావు ప్రాధాన్యత సంతరించుకున్నారు. భవిష్యత్తు చరిత్రపై విశ్వాసం ఉన్నవాడిగా నిరూపించుకున్నారు. తెలంగాణ రాష్ట్ర నిర్మాతగా వచ్చే కీర్తితో పోలిస్తే ముఖ్యమంత్రి పదవి ఏపాటిది అని చాలాసార్లు తన ప్రసంగాల్లో స్పష్టం చేయడాన్నిబట్టి అతనికి సామాజిక, రాజకీయ, చారిత్రక పరిజ్ఞానం, దాని ప్రాధాన్యత ఎంత గాఢంగా తెలుసునో అర్థమవుతున్నది.

ఇన్ని వర్గాలవారు ఎన్నోరకాలుగా ఉద్యమాలు నడిపి ఒత్తిడి తేవడం ఒక

ఎత్తైతే తెలంగాణ ఇవ్వడం ద్వారా దేశానికి, మీ పార్టీకి ఇంత లాభమని పార్లమెంటులోని చిన్నా, పెద్ద పార్టీలకు, కాంగ్రెస్ అధ్యక్షురాలు సోనియాగాంధీకి అర్థమయ్యేలా చెప్పడం మరొక ఎత్తవుతుంది. వాళ్ళు తలచుకొని ప్రధాని మన్మోహన్‌సింగ్‌గారి మంత్రివర్గానికి ఈ అంశాన్ని సూచించడంద్వారా, పార్లమెంటులో ఒక చిన్న తీర్మానం ఆమోదించడం ద్వారా తెలంగాణ రాష్ట్రం ఏర్పడుతుంది.

ఇవాళ బ్రిటీష్ ఆంధ్రులు కూడా తెలంగాణ రాష్ట్రాన్ని వ్యతిరేకించడంలేదు. గొడవలు కాకుండా తెలంగాణా వస్తే మాకేంటి నష్టమనే దృష్టి వారిలో బలపడ్డది. విజయవాడ, గుంటూరు, తెనాలి, విశాఖపట్నం ప్రాంతాలు రాజధానిగా, వ్యాపార కేంద్రాలుగా మరింత ఎదుగుతాయని ఆశకూడా వారిలో బలపడుతున్నది. అందువల్ల బ్రిటీష్ ఆంధ్రులుకూడా తెలంగాణ రాష్ట్రాన్ని కోరుకుంటున్నారు. కొందరు మాత్రమే వ్యతిరేకిస్తున్నారు. అదికూడా ఒకటి రెండు కులాలవారు మాత్రమే.

**తెలంగాణ వర్గదృక్పథాలు:**

తెలంగాణలో మెజారిటీ ప్రజలు బీసీ, ఎస్సీ, ఎస్టీ, ముస్లిం ప్రజానీకమే. వారి జీవన ప్రమాణాలు పెరగడమే అంతిమలక్ష్యం. అందువల్ల తెలంగాణ రాష్ట్రం తెలంగాణలోని మెజార్టీ ప్రజలకు, మెజార్టీ ప్రజల నాయకత్వంలో ముందుకు సాగడం అవసరం. ఉద్యమం తెచ్చే డిమాండ్ల వెనుక, నినాదాలవెనుక, నిర్మాణాల వెనుక ఆ యా వర్గాల, కులాల ప్రయోజనాలు దాగివుంటాయి. భూములు గలవాళ్ళు భూస్వాములు నీటిసమస్య గురించి మాట్లాడతారు. భూమిలేని ప్రజానీకం ఉన్నత విద్యావకాశాల గురించి, ప్రభుత్వరంగంలో పారిశ్రామిక అభివృద్ధి ద్వారా ఉద్యోగ ఉపాధి అవకాశాల గురించి మాట్లాడతారు. అందువల్ల బీసీ, ఎస్సీ, ఎస్టీ ప్రజలకు 610 జీవో ప్రకారం బ్రిటిషాంధ్ర నుండి వచ్చి చేరిన రెండు లక్షల ఉద్యోగులను కోస్తాంధ్రకు బదిలీచేసి అక్కడి రిటైర్మెంటు పోస్టులను తెలంగాణకు బదిలీచేసి తెలంగాణలో తెలంగాణవారిని ఉద్యోగులుగా తీసుకుని, అక్కడ ఖాళీఅయ్యే పోస్టులలో ఇక్కడివారికి ప్రమోషన్లు ఇచ్చి పంపడంద్వారా నింపడం జీవన్మరణ సమస్య. యుద్ధప్రాతిపదికమీద ఈ పని చేస్తే కేవలం ఒక సంవత్సరంలో రెండు లక్షల మంది తెలంగాణ బీసీ, ఎస్సీ, ఎస్టీ, మైనారిటీ యువకులు ఉద్యోగాలు పొందుతారు. తీవ్రవాదానికి ఊతమిస్తున్న నిరుద్యోగం తగ్గి చక్కని జీవనప్రమాణాలతో ప్రజలు శాంతియుతంగా అభివృద్ధిని సాధిస్తారు. ఇటీవలి కాలందాకా యాభై ఏళ్ళుగా కోస్తాంధ్రలో విద్య, ఉద్యోగావకాశాలు ఎక్కువ చేసి తెలంగాణలో వాటిని తక్కువ చేయడంవల్ల ఎంతో నష్టం జరిగి పోయింది. ఉదా॥కు తెలంగాణలో 800 ర్యాంకు వచ్చినప్పటికీ బీసీలకు బీ.ఇడీ లో సీటు రాలేదు. కాని, ఉత్తరాంధ్రలో, తిరుపతి యూనివర్సిటీ పరిధిలో 3000 ర్యాంకు వచ్చిన వారికి కూడా బీసీలకు బీ.ఇడీలో సీట్లు వచ్చాయి. అనగా సుమారు 2000 సీట్లు కోస్తా ప్రాంతంలో అధికంగా పొందారని అర్థం. అందువల్ల ప్రభుత్వ ఆధ్వర్యంలో అన్ని రకాల కాలేజీలు వాటి సీట్లు తెలంగాణలో పెంచడం అవసరం. ఇలా భూస్వాములు అగ్రకులాలు తెచ్చే డిమాండ్లు వేరుగానూ



దళిత బహుజనులు తెచ్చే డిమాండ్లు వేరుగానూ ఉంటాయి. అగ్రకులాల వాళ్ళు ఆధిపత్యంలో ఉన్నప్పుడు కేవలం నీటిసమస్యను గురించి మాత్రమే మాట్లాడతారు. చదువుల గురించి ప్రభుత్వరంగ పారిశ్రామిక అభివృద్ధి గురించి అందులోని ఉద్యోగాల గురించి మాట్లాడరు.

**వాగరాజు క్రీ.శ. 955-965; 2వ బద్దెగుడు 966; 3వ అరికేసరి 966-973; కళ్యాణి చాళుక్యులు - రెండవ తైలపుడు 973-997; సత్యాశ్రయుడు 997-1008; 5వ విక్రమాదిత్యుడు 1008-1015; జగదేకమల్ల 2వ జయసింహుడు 1015 - 1042, త్రైలోక్యమల్ల మొదటి సోమేశ్వరుడు 1042-1068; భువనైకమల్ల 2వ సోమేశ్వరుడు 1068-1076; త్రిభువనమల్ల 6వ విక్రమాదిత్యుడు 1076-1126.**

**తెలంగాణ ప్రజల చైతన్య పరిమితి:**

విప్లవోద్యమం, బహుజన సమాజ్ పార్టీ తెలంగాణ ఎస్‌సి బిసీల్లో ఎంతో చైతన్యాన్ని తీసుకొచ్చాయి అని భావిస్తుంటాము. తెలుగుదేశం పార్టీ కూడా ఎంతో కొంత బిసి నాయకత్వాన్ని అభివృద్ధి చేసిందని ప్రచారం చేస్తుంటాము. కానీ, దీన్నంతా వెనక్కి నెట్టి హిందూ మతం పేరిట బిజెపి వెలమదొర విద్యాసాగర రావును ముందుకు తెచ్చింది. విప్లవ చైతన్యం ఉన్నదని చెప్తున్న కరీంనగర్ జిల్లా నుంచి విద్యాసాగర్‌రావు పార్లమెంటుకు ఎన్నికయ్యాడు. విప్లవ చైతన్యం ఇలా బీజేపీని, వెలమ దొరలను, రెడ్లను గెలిపించడానికి పనికొచ్చింది. తెలంగాణోద్యమం పేరిట కూడా ఇదే జరుగుతున్నది. అందువల్ల తెలంగాణలోను బహుజన ప్రజానీకం చరిత్రను అధ్యయనం చేయాల్సి ఉన్నది.

**రంగురంగుల పూలతోటగా తెలంగాణ గానం :**

ఎందరో తెలంగాణ రచయితలు తమ జాతి కోసం తమ మాతృభూమి కోసం తమ గళాలను, కలాలను అంకితం చేస్తున్నారు. ఇందులో సాహిత్య విలువలున్నాయి. గొప్ప సిద్ధాంత భూమికతో తెలంగాణ చరిత్ర కళాకృతి పొందింది. తెలంగాణ రాష్ట్రం కేవలం ఒక కలంపోటుతో రాగలదు. పార్లమెంటులో చట్టం చేయడానికి దేశంలోని జాతీయ, ప్రాంతీయ పార్టీలను అందుకు సమాయత్తం చేస్తే సరిపోతుంది. అందుకు తీసుకోవాల్సిన వ్యూహం, ఎత్తుగడలు వేరు. చిన్న రాష్ట్రాల ఏర్పాటులో భాగంగా దీన్ని ఏర్పాటు చేయడం సులభం. దేవరశెట్టి జనార్దన్ వెలువరించిన 'ముక్కోటి తెలంగాణ' కవితా సంపుటికి నేను వ్రాసిన ముందుమాటలో వీటిని వివరంగా చర్చించాను. దీన్ని రెండవ అధ్యాయంలో చూడవచ్చు.

**మిలిటెన్సీ పోరాటాల పట్ల జాగ్రత్త :**

బ్రిటీషాంధ్ర వారిపట్ల విద్వేషం సమస్యను పరిష్కారానికి అతీతం చేస్తుంది. లేని ఆవేశకావేశాలను రెచ్చగొట్టి సమస్యను పార్లమెంటుకు తరలకుండా స్థానికీకరించబడి స్థానిక రాజకీయ పాలకవర్గాల ప్రయోజనాలకు అనువుగా మార్చబడుతుంది. అంబేద్కర్ తన సిద్ధాంత బలంతో ఒంటరిపోరాటంతో సైతం

భూలోకమల్ల 3వ సోమేశ్వరుడు క్రీ.శ. 1126-1138; 2వ జగదేకమల్లుడు 1138 - 1151; 3వ తైలపుడు 1151-1163; కాలచుర్యులు 1163-1183; కళ్యాణి చాళుక్య 4వ సోమేశ్వరుడు 1183-1189;
పొలవాస రాజులు : మొదటి మేడరాజు 1080--1110; మొదటి జగ్గదేవుడు 1110 - 1116; 2వ మేడరాజు 1116-1159; మంథని గుండరాజు 1116-1138; రామగుండం ఏదరాజు క్రీ.శ. 1138

కోట్లాది ఎస్‌సి, ఎస్‌టి ప్రజలకు బహుజన సమ్మతి ద్వారా సాధించారు. బుద్ధుడు కూడా శాంతి, అహింస, ప్రేమ, కరుణ, ప్రజ్ఞ, స్వేచ్ఛ, సమానత్వం, సోదరత్వం దృక్పథం ద్వారా జటిలమైన సమస్యలను మిలిటెన్సీ రూపం తీసుకునే సామాజిక చైతన్యాన్ని ప్రజాస్వామికీకరించి ఒక గొప్ప నమూనాను మన ముందుంచాడు. మిలిటెన్సీ పోరాటాల ద్వారా సాయుధ పోరాటాల ద్వారా నాయకులకు, పాలక వర్గాలకు లక్ష్యాలు, స్వప్రయోజనాలు, తక్షణ ప్రయోజనాలు నెరవేరుతాయి. మిలిటెన్సీ మనిషిని ఆలోచించనీయకుండా ఆవేశంలోకి నెట్టివేస్తుంది.

**దళిత బహుజన నాయకత్వంలో తెలంగాణ :**

మనకు వీరరసం నష్టదాయకం. మనల్ని వీరోచితంగా పోరాటం చేయమని చెప్తూ మనశవాలమీద వాళ్ళు గద్దెలెక్కుతారు. పోరాటం దళిత బహుజనుల వంతు, అధికారం రెడ్డి, వెలమ దొరల వంతా? అని ప్రశ్నించాలి.

పార్లమెంటు తీర్మానం ద్వారా ఒక కలం పోటుతో సాధ్యమయ్యేదాన్ని అసాధ్యంగా మార్చడంకోసం చేసే ప్రయత్నాలన్నిటిని ప్రజలు గమనిస్తూ ఉండడం అవసరం. దళిత బహుజన, మైనార్టీల నాయకత్వంలో భౌగోళిక, ప్రజాస్వామిక తెలంగాణ రాష్ట్రాన్ని పునర్నిర్మించుకోవడం ఈనాటి కర్తవ్యం. అందుకు అందరినీ కలుపుకుపోయే నాయకత్వం బీసీ, ఎస్సీ, ఎస్టీ, ముస్లిం, మైనార్టీల నుండి ఎదగాలి.

1909లో ముస్లింలకు ప్రత్యేక ఎన్నికలనియోజకవర్గాల కల్పన బిల్లు హౌస్‌లో ఆమోదం పొందింది. దీనివల్ల భారతదేశంలో పార్లమెంటరీ విధానానికి పునాది ఏర్పడుతుందని ప్రభుత్వం ప్రకటించింది. తర్వాత కాలంలో సిక్కులకు, 1919లో అణగారిన వర్గాలకు 1931లో అంటరానివారికి 1935లో క్రిస్టియన్‌లకు ప్రత్యేక నియోజకవర్గాలు కల్పించటం జరిగింది. అలాగే విద్యా, ఉద్యోగ రంగాలలో శూద్ర-వెనుకబడిన, అంటరాని కులాలకు రిజర్వేషన్లు సాధించటానికి మార్గం సుగమం అయింది. జస్టిస్ పార్టీ, బాబా సాహెబ్ అంబేద్కర్, పెరియార్ రామస్వామిల ద్వారా శూద్ర, అతిశూద్ర కులాలకు రిజర్వేషన్లు సాధించటానికి బలమైన సాధనంగా ఉపయోగ పడింది. ఈ విషయంలో క్రింది కులాలు యావత్తూ ముస్లింలకు రుణపడి ఉన్నారు.



# తెలంగాణ ఉద్యమం నాడు - నేడు

(రాపోలు ఆనందభాస్కర్ నాయకత్వంలో తెలంగాణా ప్రగతి వేదిక ఆధ్వర్యాన 1997లో రెండురోజులపాటు జరిగిన తెలంగాణ అధ్యయన సదస్సులో నేను చేసిన ప్రసంగ పాఠం ఇది. "నా తెలంగాణ" మాసపత్రిక నుండి ఇక్కడ చేర్చాను.)

ప్రత్యేక తెలంగాణా ఉద్యమం బాగా ఉధృతంగా ఉన్నప్పుడు 1968 - 72 దాకా నేను 'ప్రత్యేక తెలంగాణ ఉద్యమం'లో పాల్గొనలేదు. అప్పటికి నా చదువైపోయి నిరుద్యోగిగా ఉన్నాను. నా మల్టీపర్పస్ హైస్కూల్ మార్కుల ప్రకారంగా ఉద్యోగం వస్తుందని ఎదురుచూస్తూ బీడీలు చేస్తూ, బీడీల కంపెనీల పని చేసుకుంటూ ఉండేవాణ్ణి. జై తెలంగాణ ఉద్యమంలో మాస్ కాపీయింగ్‌వల్ల 83 శాతం పైగా మార్కులు వచ్చినవారికి ఉద్యోగాలు దొరికాయి. నా 64 శాతం మార్కులకు ఉద్యోగం రాకుండా పోయింది. సరే అది అలా వుండనీ.

ఆ కాలంలో ప్రత్యేక తెలంగాణ ఉద్యమకారులు నా దగ్గరికొచ్చి, మిత్రుడు సంజీవరావులాంటి వాళ్లు, వీళ్లు ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్నపుడు నేను తెలంగాణ ఉద్యమాన్ని వ్యతిరేకిస్తూ వాదించాను. ఎందువల్లనంటే సెంటిమెంట్స్‌ను మీ ముందు ఉంచడానికి ఆ విషయం మీకు చెపుతున్నాను. ఎందువల్ల వ్యతిరేకించానంటే, అందుకు రెండు కారణాలున్నాయి.

**తప్పుడు సమాచారంతో మోసగించిన పత్రికలు :**

ఒకటేమో ఆంధ్రప్రతిక ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి లాంటి పత్రికలు అటువైపు వస్తున్నప్పుడు కలిసి ఉండటంతోనే ఎక్కువ లాభం ఉన్నదని లెక్కలు చూపించినవి. నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు అది ఇది అని లెక్కలు చూపడం, కమ్యూనికేషన్ ద్వారా మన మనసుని మార్చేసినాయి. వాళ్ల వైపు నుండి, శతృవు వైపు నుండి లేదా ఇతర వైపుల నుండి చేసిన దాడి, నామీద సాధించిన ఆధిపత్యం. రెండవది నాకే ఒక భయం ఉన్నది. అండ్ల కనపడ్డోళ్ళంతా వెలమలు, పైసలున్నోళ్లు, నన్ను, నా కులాన్ని అరే, ఒరే అని పిలిసెటోళ్లు నాయకులుగా తేలిన్రు. దాన్ని చూసి వామ్మో, వామ్మో ఆంధ్ర కలిసి ఉంటెనే మంచి గుంటది, లేకపోతే ఈ రెడ్లు, వెలమలు మనల్ని పీక్కదిన్నట్టే చూస్తరా? నన్ను అని చెప్పేసి నేను బాగ బాధపడ్డా.

**తెలంగాణ ప్రజల సెంటిమెంటు :**

నేను అనుకోవడం ఈ సెంటిమెంట్ నా ఒక్కడికే కలిగిందా? నిజానికి నాకు అప్పటికి తెలంగాణ పట్ల వ్యతిరేకతగాని, అనుకూలతగాని లేదు. కాని నా జీవితంలో

కలిగిన భావన అది. అయితే నేను ఎదిగిన తరువాత నక్సలైటుగా మారిన తరువాత, విప్లవ రచనలు చేసిన తరువాత తిరిగి అధ్యయనం చేస్తున్నప్పుడు 1946 - 56, 68-70 ఈ 10,12 ఏళ్ళకు ఓ మారు తెలంగాణ ఉద్యమం వస్తున్నప్పుడు ఎస్.సి, బి.సిలు భయపడి పోతున్నారని నేను అనుకుంటున్నాను. కారణం ఏమిటంటే తెలంగాణలో ఉన్నటువంటి అగ్రకులాల వారు, అగ్రవర్ణాల వారు, భూస్వామ్య ఫ్యూడల్ అహంకారాన్ని వదులుకోకుండా, వాళ్లు ప్రజాస్వామికీకరణ చెందకుండా, అదే అహంకారంతో బతుకుతూ ఆ సమాజం మీద ఆధిపత్యం చలాయిస్తున్నారు. ఏ కాస్త చైతన్యం వచ్చినా సరే వీళ్లే అంది పుచ్చుకుని తిరిగి ఆ భావజాలానికి తానే నాయకుడంటారు. పీపుల్స్‌వార్ పార్టీ కావచ్చు, కాంగ్రెస్ కావచ్చు, తెలుగుదేశం పార్టీ కావచ్చు, ఏ పార్టీలో చూసినా మళ్లీ ఈ అగ్రవర్ణాల వారు వస్తున్నారు.

**అగ్రకుల నాయకత్వం అహంకారం - ప్రజల్ని భయపెట్టే తీరు :**

మీకు ఒక ఉదాహరణ కూడా చెపుతాను. 1977లో జనతా పార్టీ నిలబడ్డప్పుడు, తెలంగాణలో దాన్ని సపోర్టు చేసిన వాళ్లంతా అగ్రవర్ణాల వారైపోతే ఎస్.సిలు, బి.సిలు చాలా ఖచ్చితంగా కాంగ్రెస్‌కే ఓటేసింద్రు. అటు జనతా పార్టీకి, రాష్ట్రంలో, దేశంలో పేరున్నది ఓహో! ఎమర్జెన్సీని వదిలించిన పెద్ద పార్టీ అని పేరున్నది. కానీ ప్రజలు దాన్ని అట్లా చూడలేదు. అందువల్ల ఈ వర్గ వైరుధ్యం ఏదైతే ఉందో, కుల వైరుధ్యం ఏదైతే ఉందో, ఈ ఫ్యూడల్ అహంకారం ఏదైతే ఉందో అగ్రవర్ణాల్లో ప్రజాస్వామీకరణ ఏదైతే ఉందో అది అక్కడి ప్రజల్ని భయపెడుతూ వస్తున్నదని నేను ఫీలవుతూ వస్తున్న.

**తెలంగాణ ప్రజల హృదయ నిర్మలత్వం :**

హృదయ నిర్మలత్వం భాషలో భావ వ్యక్తీకరణలో, తెలుగులో ఉంటుంది. దాశరథి రంగాచార్యగారు కూడా ఇదేమాట అంటూ ఉంటారు. మన వాళ్ళకి ఓపిక లేదు. కోపం వస్తే ముఖం మీద అనేస్తారు. అదే మనల్ని దెబ్బతీస్తూ ఉంటుంది. హిపోక్రటిక్ లౌక్యం మన తెలంగాణ వాళ్లకి తెలియదు అని అంటే లౌక్యం తెలియని స్థాయిలో హృదయాన్ని ఎదుటివాళ్లతో పంచుకోవటం అనేది తెలంగాణలో మొదటి నుంచి వస్తున్నది.

**తెలంగాణ జానపద సాహిత్య ప్రత్యేకత :**

తెలంగాణ జీవితంలో ఉర్దూ భాష ప్రభావం మన మీద వేయడం వల్ల, అక్షరాస్యత నేర్చుకునే అవకాశం చాలా తగ్గిపోవడం వల్ల జానపద సాహిత్యానికి, కళలకి ఎనలేని ప్రాచుర్యం, అవి సజీవంగా ఉండడం సాధ్యపడింది. కోస్తాలో ఇంతగా జానపద సాహిత్యం, కళలు మీరు, మనం చూడం. అట్లనే మేం బెంగాల్లో తిరిగినప్పుడు, అంటే కలకత్తా ఆ జిల్లాలు తిరిగినప్పుడు బెంగాళ్ళ, అక్కడ కూడా, ఈ జానపద సాహిత్యం లేదు. మీ దగ్గర బాగున్నదేంది అని అన్నరు. బీహార్ల చూస్తే మళ్లీ గ్రామీణ ప్రాంతాల్లో, అడవి ప్రాంతాల్లో ఉన్నది. ఎక్కడైతే ఈ అక్షరాస్యత ప్రవేశించలేదో, అక్కడ ఈ జానపద సాహిత్యం ఉన్నది. అట్లా నిరక్షరాస్యత వల్ల, నిజాం పరిపాలన



వల్ల, ఉర్దూ మీడియం వల్ల మన జానపద సాహిత్యం కళలు సజీవంగా ఉన్నాయి. ఒక్కొక్క కులానికి ఒక్కొక్క ఇతిహాసం, మ్యూజిక్ ఇన్‌స్ట్రుమెంట్స్.. ఇట్లాంటివిచాలా ఉన్నాయి. కళాకారుల కులాలు కూడా మన తెలంగాణలో చాలా ఎక్కువగా ఉన్నాయి.

**కాకతీయ వంశావళి**

మొదటి బేతరాజు క్రీ.శ.1000-1052
మొదటి పోలరాజు క్రీ.శ. 1052-1076
రెండవ బేతరాలు క్రీ.శ. 1076-1108
దుర్గనృపతి క్రీ.శ. 1108-1116
రెండవ ప్రోలరాజు క్రీ.శ. 1116-1157
కాకతి రుద్రదేవుడు క్రీ.శ.1158-1195
కాకతి మహదేవుడు క్రీ.శ. 1195-1198
గణపతిదేవ చక్రవర్తి క్రీ.శ. 1199-1261
కాకతి రుద్రమదేవి క్రీ.శ. 1261-1295

ఇది ఒక ప్రత్యేకమైన టువంటి చరిత్రని, ఇతిహాసాన్ని తెలియజేస్తున్నది. దీన్ని రికార్డు చేయట్లేదు మనం, సరిగ్గా చేయట్లేదు - చేయాల్సినంతగా... ఏదో రామరాజు గారు చేశారు. జయధీర్ తిరుమల రావు గారు గాని - అవి చాలవు. చాలా పెద్ద ఎత్తున చేసి ఉండాల్సింది. ఒక ప్రభుత్వం స్థాయిలో చేసి ఉండాల్సింది. ఇవన్నీ కొత్త తరంలో చదువు నేర్చుకుం టున్న కొద్ది, ఆ పాటల్ని, ఆటల్ని, ఆ డప్పుల్ని, ఆ సంగీత వాయిద్యాల్ని వదిలేస్తున్నారు. అంటే కనుమరు గవుతున్నాయి. దీన్ని మనం కాపాడు కోవాల్సి ఉంది.

**మన భాషను మనం రాసుకోవాలి :**

మన సంస్కృతిలో ఇవి ఇంతదాకా చిన్నవి అనుకున్నాం. ఇవి మంచివి కావు. అచ్చు, అక్షరం బాగుంటుందని! కాని ఎలక్ట్రానిక్ మీడియా, అంటే టేప్ రికార్డర్లు సినిమాలు, వీడియోలు, టీ.వీ.లు వచ్చిం తరువాత ఓ! అచ్చు కన్న దీనికే ఎక్కువ వ్యాప్తి అని మళ్లీ కొత్తగా కనుక్కున్నాం. అందువల్ల ఆ శ్రవ్య సాహిత్యాన్ని మనం ప్రిజర్వు చేసుకోవలసినటువంటి అవసరం, బాధ్యత మన మీద ఉన్నది. ఆంధ్రప్రాంతంలో, కోస్తా ప్రాంతంలో తిరుగుతున్నప్పుడు నాకు భాష రాక, పత్రికా భాషలో రాయటం రాక పాపం ఇతడు తెలంగాణ భాషలో కథలు రాస్తుండు, బి.ఎస్.రాములు అని అనుకున్నరు. రాయడం రాక, అంటే చిన్నచూపు అన్నమాట. వాస్తవానికి నేను తెలుగులో బి.ఒ.ఎల్ చేసిన. తెలుగు పండిట్ ట్రైనింగ్ చేసిన వ్యక్తినని వాళ్లెవరికి తెలియదు.

**జోకర్లకు, విలన్లకు మన భాషెందుకు పెడుతున్నరంటే :**

అయితే మన భాషను మనం పట్టుదలతో రాసుకోవాలి. మన భాషను గౌరవించుకోవాలి అని మనం అనుకుంటే వాళ్ళనేదేమిటి? వాళ్లకి ఆ భాష రాక ఇలా రాస్తున్నారనేది. తరువాత సినిమాలలో చూసినపుడు యాదగిరి అని చెప్పి 'ఎకసెక్కాలు' చేయడం, గూండాలను పెట్టడం. మన భాషని హాస్య పాత్రలకి పెట్టడం, ఒక ప్రజా పోరాటమో ఏదో సినిమా, దాంట్లో శారద హీరోయిన్‌గా ఉండే, అన్ల కోట శ్రీనివాసరావు విలన్, అసిస్టెంట్ విలన్‌తో ఏమనిపిస్తడంటే, అరే మీ హైద్రాబాద్‌ల ఏం గావాలని మినిస్టర్స్ అడిగినప్పుడు, ఏం అడగుతవురా నీవు, అని, అరేయ్,

మనకు సముద్రం గావాలని అడుగురా నువ్వు, అని అంటాడు అన్నమాట. 12 ఏళ్ల క్రింద తీసింద్రు. అంటే హైదరాబాద్‌ల సముద్రం కావాలని అడగమని వీనికి చెప్తడు. అంటే తెలంగాణ లీడర్స్‌గాని, ప్రజలు గాని, సముద్రం అనేది సహజమయింది అనేది తెలవక, చెరువు తీరుగ కట్టుకుంటరనే ఉద్దేశంతో! అక్కడ అంత సీరియస్‌గా జోక్ పెట్టిండు. అట్లాగే 'శివ' సినిమాలో ఆ ఒరంగల్ బోయిరాంగ గూండాలు ఆ మురళి మోహన్ తమ్ముణ్ణో, ఎవణ్ణో చంపేటప్పుడు అంతా తెలంగాణ భాషలో మాట్లాడతరు! కాలేజీల వీడేమో ఆంధ్ర సైడ్ నుంచి వచ్చి మంచి హీరో మాదిరిగ ఉంటడు నాగార్జున. ఎంత అంటే ఒక పకడ్బందీగా, ఒక సాంస్కృతిక అణిచివేత భావజాలం మన మీద కొనసాగుతూ వస్తున్నది. అది మనల్ని గూండాలుగా, అనామకులుగా, కట్టెలు గొట్టెటోళ్ల క్రిందనో, ఇట్లా జోకర్లుగా, బఫూన్‌లుగా మారుస్తూ వస్తున్నరు.

**మన ఆత్మగౌరవాన్ని, భాషను కించపరచిన పత్రికలు :**

మన అంజయ్యని - ముఖ్యమంత్రి అంజయ్యని, అట్లాగే, మన అంజయ్య తీర్గనే మాట్లాడేదట గుడిసెల వెంకటసామి... ఆ భాషను డెయిలీ పేపర్లలో పెట్టి, లీడులో పెడితే సంతోషమే. అయితే ఎకసెక్కెం పద్ధతిలో లీడులో పెడతా ఉంటే నాకు చాలా బాధ అనిపించేది. ఓర్ని మనం మాట్లాడుకునే భాషనే కదా! మరి గింతగనం తిట్టుకుంట ఎందుకు రాస్తున్నరు వీళ్ళు అని! అంటే ఏమిటి? భాష నువ్వు, నేను మా అమ్మ ఎవరి నుంచి నేర్చుకున్నది? సుట్టుపక్కల నేర్చుకున్నదే. మనం ఇంగ్లాండ్‌ల పుడితే ఇంగ్లీషు నేర్చుకుంటం. ఇక్కడ పుడితే తెలంగాణ నేర్చుకుంటం. అయినపుడు ఎకసెక్కం చేసుడెందుకు? ఈ విధంగా ఆధిపత్య తత్వాన్ని సామాజికంగా, రాజకీయంగా పెత్తనం చెలాయించడంలో భాగంగా నా భాష గొప్పది, సంస్కృతి గొప్పది అనే భావాన్ని వాళ్లు ప్రచారం చేసిన్రు.

**మద్రాసు రాష్ట్రంలో తెలంగాణ కలిసిందా?**

మనకు చాలా విషయాల్లో సాక్ష్యాలు కూడా ఉన్నాయి. ఇప్పుడు మనకు డిపార్ట్‌మెంట్ టెస్టులుంటాయి. ఎన్జీవోలకు, టీచర్లకు ప్రమోషన్లు రావాలని చిన్న చిన్న టెస్టులున్నాయి. అండ్ల సర్వీసు రూల్స్‌లో మద్రాసు సర్వీసు రూల్సు అని ఉంటాయి. అంతకన్న ముందు 1956 కన్న ముందు ఆ సర్వీసు రూల్స్ కనుక మనం చదివితే ఆంధ్ర అనే రాష్ట్రంలో, కర్నూలు రాజధానిగా ఏర్పడిన ఆంధ్ర అనే రాష్ట్రంలో తెలంగాణ అనే ప్రాంతం విలీనం చేయబడ్డది అనే విషయం మనకర్థమయితది. మీరు చూడండి. మీరు పరీక్షలు వ్రాసేటప్పుడు రాయలసీమ, కోస్తా, ఉత్తరాంధ్ర, తెలంగాణా అనే ప్రాంతాలు కలిసి ఒక రాష్ట్రంగా ఏర్పడ్డాయి అనే భావన ఆ సర్వీస్ రూల్స్ చదివితే అన్పియ్యదు. మద్రాసు రాష్ట్రానికి సంబంధించిన దాంట్లో ఒక భాగం ఆంధ్ర అని ఏర్పడితే ఆ ఆంధ్రలో తెలంగాణాను విలీనం చేశారు. అత్తగారింటికి పంపించినట్లు. ఆ భాషలో, సర్వీస్ రూల్స్‌లో ఆ భావం ఇప్పటికీ ఉంది.



**కమ్యూనిస్టులు విశాల తెలంగాణ అని ఎందుకు అన్లేదు :**

రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి క్రీ.శ.1295 - 1323. 1323లో కాకతీయ సామ్రాజ్య పతనం తరువాత ముస్లింల పాలనలోకి వచ్చింది. కాపయ నాయకుడు 1336. 1336 లోనే హరిహర బుక్కరాయులు విజయనగర స్థాపన. రేచర్ల రుద్రనాయకులు 1213లో పాలంపేట రామప్ప దేవాలయం నిర్మించారు. శాలివాహన శకం 1176 ఆనంద నామ సంవత్సర చైత్ర శుద్ధ పంచమి రోజున అనగా క్రీ.శ. 25-3-1254 రోజున కాకతీయ సామ్రాజ్యం ఏలిన ప్రతాపరుద్రుని జన్మదినం.

ఇది నేను ఆ పరీక్షలు రాసేటప్పుడు నాకర్థమయ్యింది. వార్నీ యవ్వ.. మనకు సర్వీస్‌రూల్స్‌లో కూడా అణిచివేత, సాంస్కృతిక అణిచివేత! మన తెలంగాణ సర్వీస్ రూల్స్ లేవు. అది ఒక కేవలం సేఫ్‌గార్డ్ . ఒక పర్టిక్యులర్ అంశం క్రింద తెలంగాణ సేఫ్‌గార్డ్స్ అని మార్చిపడేశారు. తెలంగాణకు సంబంధించి నటువంటి సర్వీస్ రూల్స్ అని జనరలైజ్ చెయ్యలేదు. అట్టనే విశాలాంధ్ర అనే నినాదం మనం ఇస్తే కాదని కాంగ్రెసోళ్లు ఆంధ్రప్రదేశ్ అని చేసింద్రని ఓ కమ్యూనిస్టులు బలే వాపోతుంటారు. విశాలాంధ్ర అనే ఇచ్చిన్రుకాని, "విశాల తెలంగాణ" అనైతే ఇవ్వలేదు కద! విశాల తెలంగాణ నిర్మాణం గురించి ఇంతకుముందు దాశరథి రంగాచార్య గారు చెప్పింద్రు. అసలు మొత్తం కలిసి ఇదంతా తెలంగాణా క్రిందనే ఉండే, దాంట్లో నుండి దాన్ని సర్కార్‌కి ఇచ్చేసింద్రు. ఇది దత్తమండలం అన్నారు అని, కాని విశాల తెలంగాణ రాష్ట్రం చేద్దాం అని అనుకోలే. అట్లాగే రెడియోలల్ల, టీవీలల్ల, సినిమాలల్ల మన భాష లేనే లేదు. అంతటా ఆ గుంటూరు, కృష్ణ, ఈస్ట్ గోదావరి, వెస్ట్ గోదావరి భాషనే ఉంటుంది.

దాంట్లో మనోళ్లు నౌకరిగాళ్లు కూడా లేరు. ఆ ఎస్.సి, బి.సి రిజర్వేషన్లు ఏమన్న వుంటే అవి కూడా తెలంగాణోళ్లు గాకుండా కొత్త గూడెం రేడియో స్టేషన్లోగాని, వరంగల్లుగాని, నిజామాబాద్‌గాని, హైదరాబాద్‌గాని అంతా మల్ల ఆంధ్రావాళ్లు వచ్చి చేరిన్రు. ఆ బ్యాంకులల్ల గూడ ఆంధ్ర రీజియన్, ఎల్.ఇ.సిలో ఆంధ్ర రీజియన్ అంటే బి.సిలు, ఎస్.సిల రిజర్వేషన్ల మళ్ల ఆంధ్రోల్లే నిండిన్రు. ఇట్ల వాటన్నిట్లల్లో మన పోస్టులు నింపుకోక పోవడం వల్ల మన బాస ఏమైంది?

**మన మార్కెట్ మందం మన తెలంగాణ సినిమాలు తీయాలె :**

మన భాష మనకే పరాయీకరణం చెంది, మనకే దూరం అయిపోతున్నది. ఏదో భాష మన మీద రుద్దబడుతూ వస్తున్నది. మరి సినిమాలల్లో బోలెడు పెట్టుబడులున్నై. మనం ఎన్నో సినిమాలు తీసుకోవచ్చు. అమ్మో తెలంగాణాల ఇప్పటిదాకా ఉన్నటువంటి, సినిమా రంగంలో తెలంగాణ పట్ల వున్న అపప్రద ఏమిటంటే, ఒక్క నైజాంల ఆడితే సినిమా సక్సెస్ కాదు కదా! నారాయణమూర్తి ఒక సినిమాలో బాగా తెలంగాణ డైలాగులు పెడితే తెలంగాణలో బాగా సక్సెస్ అయిందిగాని 50 పర్సెంటు ఆంధ్రాలో ఫెయిల్ అయ్యింది... అని చర్చ వచ్చింది. అట్లాగే "చిల్లర దేవుల్లు" గాని, "మా భూమి" సినిమాగాని...

ఇది తప్పుడు ఆర్గ్యుమెంటని నేనంటున్న. ఎట్లా అంటే, కన్నడంలో సినిమా కేవలం బెంగుళూరులో ఉన్న '8' టాకీసుల్లో నెలరోజులు ఆడితే సక్సెస్‌ఫుల్ సినిమా. దాని పైసలు దానికి వస్తున్నయి. అట్లనే కేరళలో కూడా ఒక కోటి జనాభానే ఉన్నరు. అక్కడ కూడా వాళ్లు సినిమా తీస్తే, వాళ్ల పైసలు వాళ్లకు వస్తూనే ఉన్నయి. ఇంక వాళ్లకు నేషనల్ అవార్డ్స్, ఇంటర్నేషనల్ అవార్డ్స్ కూడా వస్తునే ఉన్నయి. మరి మన దగ్గర మూడు కోట్ల జనం ఉన్నరుగద తెలంగాణల. మరి వీల్లందరు మన తెలంగాణ భాషను చూడరా? ఆ స్థాయిలో, ఆ బడ్జెట్ పద్ధతిలో మనం ఎందుకు వేసుకుంటలేం? ఆ పద్ధతిలో ఆలోచన చేసుకోవడమే గాకుండా, నటులను, తెలంగాణ నటులను తయారు చేసుకోవాలి.

తెలంగాణ నటులు లేకపోతే ఎట్ల తయారవుతరు? తెలంగాణ దర్శకులు లేకపోతే ఎట్ల తయారువుతరు. కరీంనగర్ నుంచో, వరంగల్ నుంచో, ఆదిలాబాద్ నుంచో, నిజామాబాద్ నుంచో, ఇప్పుడు రచయితలు తయారయ్యిండ్రు. ఆదిలాబాద్ నుంచి గూడ అంజయ్య ఉంటే, నల్లగొండ, కరీంనగర్ నుంచి సుద్దాల అశోక్ తేజా వస్తున్నరు. నిర్మాతలు వస్తున్నరు. దర్శకులను, నటులను తయారు చేసుకోవలసిన అవసరం, బాధ్యత మన మీద ఉన్నది. అట్లాగే కమ్యూనికేషన్ సిస్టంలో పాశం యాదగిరి చెప్పినట్లు మన పత్రికల్ని మనం స్థాపించుకోవాల్సిన అవసరం ఉన్నది. లేకపోతే మన భాష మనకే పరాయిది అయిపోతుంది.

మన వార్తలు వాళ్లు వెయ్యరు. నేను పదేళ్ల నుంచి చెప్తున్న! ఏమని? ఈనాడు, ఆంధ్రప్రభ, ఉదయంలల్ల జిల్లా పేపర్లు పెట్టిన్రు. ఎడిషన్లు తెలంగాణ , ఉత్తర తెలంగాణ అనే ఎడిషన్లు పెట్టిండ్రు గదా! కనీసం ఎడిషన్లల్లనన్న తెలంగాణ భాషను రాసి అచ్చేయవచ్చు గదా! జిల్లా ఎడిషన్లల్లనన్న తెలంగాణ యాసను రాసుకోవచ్చు గద. ఏ జిల్లాలో ఆ జిల్లా మాండలికం రాయొచ్చు గదా అని నేనన్న. అంటే ఒకరిద్దరు ఎడిటర్లు ఏమన్నారంటే నా తోటి - మీరన్నది నిజమేగని అక్కడ వున్నది, పని చేస్తున్నది ఆంధ్రోళ్లు గదా, సబ్ ఎడిటర్‌లుగా పని చేస్తున్నరు అన్నారు. అంటే మన పేజీలు చూసేదిగూడ వాళ్ల వాల్లే. అంటే సెన్సారింగ్ కూడా చేస్తున్నరు. మన భాషని పత్రికా భాష కనుకూలంగా తెలంగాన భాషను తయారుచేయాలి. దీని మీద చాలా సీరియస్‌గా పాత కాలంలో సురవరం ప్రతాపరెడ్డి పని చేశారు.

ఆ తరువాత కొంత ఇప్పుడు యాదగిరి కృషి చేస్తున్నాడు. మనం డిక్షన్‌కి, మన భాషకి, సంస్కృతిని, ఏ పదాలకు, ఏ పదాలు వాడాలి అనేదాన్ని ఇంగ్లీష నుంచి డైరెక్టుగా తెలుగు డిక్షనరీ, బూదరాజు రాధాకృష్ణ ఎట్లయితే ఈనాడు భాష కోశం తయారుచేశాడో అలాగే తెలంగాణ బాస కోశం తయారుచేసుకోవల్సిన బాధ్యత, మన మీద ఉన్నది. శంకర్ నారాయణ డిక్షనరీని చదవడం కాదు ఇప్పుడు మనం, లిఫ్కో డిక్షనరీని చదవడం కాదు. మనం తెలంగాణను, ఇంగ్లీష్ నుండి తెలుగులోకి అనువాదం చేసినపుడు తెలంగాణలో ఏమంటామో అని చెప్పి చేయాలి.



అట్లాగే మన రచయితలు తెలంగాణ పదాలకి సాహిత్య గౌరవ ప్రతిపత్తిని ఇవ్వాలి. 'నీకెరుక లేదు పో' అని అంటాం మనం. ఈ ఎరుక లేదు అనే పదాన్ని మనం రొటీన్‌గా మాట్లాడుతుంటే వాళ్ళేమో తెలియదులే అనే పదం వాడతారు. అయితే ఎరుక అనే పదానికి నిజమైన అర్థం ఏమిటి అని దాని మీద నేను ఒక పుస్తకమే రాసిన.

**అల్లావుద్దీన్ ఖిల్జీ ఢిల్లీ సింహాసనం క్రీ.శ. 1296. 1316లో ఖిల్జీ మరణం. 1320లో ఖిల్జీ వంశమంతమొందించి తుగ్లక్ వంశీయుడైన ఘియాసుద్దీన్ తుగ్లక్ ఢిల్లీ సుల్తాన్ అయ్యాడు. 1294-1351 మధ్య కాలంలో ఖిల్జీ, తుగ్లక్ సైన్యాలతో పాటు దక్షిణాదికివచ్చి స్థిరపడిన వారిని దక్కనీలు అంటారు. 1521లో బహమనీ రాజ్యం అంతరించింది. దాని స్థానంలో ఐదు రాజ్యాలు ఏర్పడ్డాయి. అందులో గోల్కొండ కుతుబ్ షాహీ రాజ్యం ఒకటి.**

**తెలంగాణ భాష గౌరవం పెంచాలె :**

'గతి తర్క దర్శన భూమిక ' పుస్తకంలో కాగ్నిషన్ అంటే ఏమిటి, కాగ్నిషన్ ప్రాసెస్ అంటే ఏమిటి ఎపిస్టమాలజీ అంటే ఏమిటి అనే దాని మీద చాలా సీరియస్‌గానే రాసి ఆ ఎరుక అనే పదాన్ని చూసి మీది తత్త్వభాష అన్నరు. అబ్బో ఇంత గట్టిదా ఈ ఎరుక అనే పదం అని అన్నరు. మనకే పదాలయితే ఉన్నవో, ఆ పదాలకి సాహిత్యగౌరవం, తాత్విక గౌరవం తీసుకు రావడం మన బాధ్యత. అపుడపుడు మా అవ్వ నన్ను తిట్టేది. ఊకో నీతల పండు పలగ అని, అంటే కోపం వచ్చినప్పుడు నీ తల పండు పలగ అది జేసినవు. ఇది జేసినవు అని. నేను దీన్ని ఒక మూల కందం అని, 'కర్నెల్ ' అని లెనిన్ ఒక పదం వాడిండు. ఒక ఫిలాసఫర్ ఈ కర్నెల్ అనే దానికి గుజ్జు, గిజ్జు గట్టిది అని, మా యవ్వ అన్న తలపండు అని పెట్టేసి దాని అనువాదంతో ఆ వ్యాసాన్ని రాస్తే, అబ్బ ఎంత అద్భుతమైన నుడికారాన్ని తయారుజేసినవు బై అని పార్టీల చర్చ. అంటే, మన భాషని మనం కించపరుచుకున్నంత కాలం మనకు మన భాషలో ఉన్న సొగసు అర్థం కాలేదు. అందులో వున్న సొగసును అర్థం చేయించి దానిని తాత్వీకరిం చాల్సిన బాధ్యత మనకున్నది అనే ఆత్మ విశ్వాసం కలిగినప్పుడు, ఎదుటివాళ్లు కూడా మనల్ని గౌరవిస్తారు. అట్లనే మనకు హక్కుల సామెత కూడా ఉన్నది.

ఇంటోళ్లు లంజ అంటే అందరు లంజ అంటరని, ఇంటోళ్లు కాదని అంటే ఎవరు కూడా నోరెత్తరు. మన భాషను మనం గొప్పదని చెప్పుకోగలిగినప్పుడే అందరూ కూడా గొప్పదే... గొప్పదే.... అని అంటరు. అది మనం చేయాల్సింది. తరువాత మన సంస్కృతిల ఏం జేసిన్రంటే ఈ దేవుళ్లకి సంబంధించినవి మైసమ్మ, కట్టమైసమ్మ, పోచమ్మ, ఎల్లమ్మలకు మొక్కుడు, ఓ ఇవి చిన్న దేవుళ్లు, సిల్లర దేవుళ్లు అనుకుని ఇచ్చేసుకున్నారు. తరువాత క్రమక్రమంగా సదవంగ సదవంగ కంచ అయిలయ్య అసుంటోళ్లు వాళ్లు, వీళ్లు రాయంగా, రాయంగ ఏమి దెలిసిపోయింది అది మెసపటోమియా నాగరికత నుంచి మొదలుపెట్టేసి కట్టమైసమ్మకు సంబంధాలున్నై.

అసలు కట్ట మైసమ్మ, చెరువు కట్టల్ని నిర్మించడం నేర్చుకున్న స్త్రీ. ఒక ఇంజనీర్ అని నిర్ధారించే ప్రయత్నాలు ఇప్పుడు జరుగుతున్నాయి. అంటే మన చరిత్ర మనకి నైతికంగా, సైద్ధాంతికంగా మద్దతు నిచ్చేటటువంటి సూత్రీకరనలు చేసుకొనకపోతే మనమే ఓడిపోతాం. చరిత్రను ఎప్పటికీ రీరైట్ చేయాలి.

మనచరిత్రని మనం తిరిగి రాసుకోవడం అంటే ఏమిటి. మన ఆధిపత్యాన్ని, మన ఆత్మవిశ్వాసాన్ని పెంచుకునే దృక్పథంలో భాగంగా వ్రాసుకోవడం కదా! అందువల్ల ఆ చరిత్రలో వ్రాసుకోవడంలో ఉండేదేమంటే మన ప్రాంతీయ తాత్విక దృక్పథ ప్రయోజనాలు. తరువాత ప్రత్యేక తెలంగాణ ఏర్పడితే చాలా నష్టంబై వాళ్లకు. వీళ్లకు అని అంటే నీయవ్వ, అన్నదమ్ములం మనం కలిసుంటంకదా! నీయవ్వ వాడు ఒకడు లెక్చరయితడు, ఒకడు అటెండరవుతడు, అన్న లెక్చరర కాంగనే ఏరుబడతడు, తమ్ముడికి ఎక్కడ బెట్టాల్సి వస్తుందో నా పైసలకెల్లి అని, అవ్వ అవ్వ నీకు నెలకు నూరు రూపాయలు పంపిస్త అని ఒప్పందం చేసుకుంటున్నరు. అంటే సామాజిక అసమానతల్ని మనం నేను నా భార్య, నా పిల్లలు అనుకుంటున్నం తప్ప, నేను తమ్ముడు, చెల్లెలు అని గూడ అనుకుంటలేము.

ఇట్లాంటి దశలో ఒక ప్రాంతానికి ప్రాంతం, ఒకటి అయి కలిసి ఉండాల్సిన అవసరం ఏముంది? దాన్నుంచే గదా మాదిగ దండోరా పుట్టేసి మా వాటా మాకు కావాలి అని అంటున్నరు. అట్లనే మనం ఇదే ప్రశ్నని విడిపోతే నీకొచ్చిన నష్టం ఏమిటి బై అని ప్రశ్నించాల.

**తెలంగాణ ఏర్పడితే ఆంధ్రోళ్లకు ఏం నష్టమో అడగాలె :**

నీకొచ్చిన నష్టం ఏముందిబై విడిపోతే ఆంధ్ర ఆంధ్ర వాళ్లకే ఉంటుంది. మేం విడిపోతం అని అనుకుంటున్నం. తమ్ముడు ఇట్లనే ప్రశ్న వేస్తడు ఇంట్ల వేరు పడేటప్పుడు మీరు చూడండి అన్నేమో! ఏంద్రా మన కాందాను మనం మంచిగ కలిసుండాల్నాయె. ఏరు పడతంటే ఎట్లరా అనంటే, నీకెందుకే నేను ఏరుబడత ఏమన్న ఛస్త! అంటే అన్నున్నప్పుడు పెండ్లంతో సరసాలాడ రాదాయె, అంటుకోనికి రాదాయె, ఏం చేయరాదాయె, ఊకె సచ్చేదాక అన్నదే పెత్తనమాయె. అందుకోసం తాను ఏరుపడితే పెండ్లం మీద పెత్తనం నేను చూసుకుంట అని ఉంటది కదా. తమ్ముడు ఎప్పుడు ఇదే మాట అంటాడన్నమాట. ఏంది నీకెందుకే నేను ఏరుపడితే నీకేందే – నష్టమైతే నాకే నష్టమాయే. అదే మాటను కోస్తా వాళ్లకు కూడా మనం చెప్పాలి. ఏరుపడితే నీకేం నష్టం వచ్చిందో సెప్పు అని అడిగితే సెప్పడు కదా! ఎందుకంటే నష్టం వచ్చిందని చెప్తే ఇన్నాళ్లు అనుభవించిన విషయం తెలిసిపోద్ది కదా! ఈ ఎదుటి వారిని ప్రశ్నించే పద్ధతికి మనం క్వశ్చనింగ్‌ని, ప్రశ్నని ప్రశ్నగా తిరిగి ఎక్కుపెట్టే స్థితికి మనం ఎదిగించుకోవాలి.

మన భావజాల అధికృతని సాధించుకోవాలె. తరువాత ఇంకొక్క చిన్నవిషయం. తప్పు పట్టుకోవద్దు. మాదిగ దండోరా ఉద్యమంలో పాల్గొన్నటువంటి రాష్ట్ర నాయకులు టెంత్ కూడా పాస్ కాలేదండి. ఆ కృపాకర్ ఏమో ఆరో తరగతి చదివిండు. ఈయనేమో 7వ తరగతి చదివిండు, మంద కృష్ణ మాదిగ, దళిత మహాసభ వచ్చినపుడు, కారంచేడు



ఉద్యమం వచ్చినపుడు దాంట్లో పనిచేసిన కత్తి పద్మారావు వెంట ఆయన శిష్యులుగా ఉండి అక్కడ మాలతనాన్ని రుచి చూసి ఏమో! సార్ సార్ నేను మా ప్రకాశం జిల్లాకు వెళ్లిపోయి అక్కడ మా మాదిగ దండోరా పెట్టుకుంట సార్, ఎ.బి.సి.డి.ల వర్గీకరణ పెట్టుకుంట సార్ ఎట్లుంటది అని అడిగిండు ఒకసారి కృపాకర్.

**గోల్కొండ కుతుబ్ షాహీ వంశం**
**క్రీ.శ. 1518-1687.**
**సుల్తాన్ కులీ కుతుబుల్ ముల్క్ 1518-1543; జమ్షీద్ కుతుబ్ షా 1543-1550; సుభాన్ కుతుబ్ షా 1550; ఇబ్రహీం కుతుబ్‌షా 1550-1580; మహమ్మద్ కులీ కుతుబ్ షా 1580-1612; సుల్తాన్ మహ్మద్ కుతుబ్ షా 1612-1624; అబ్దుల్లా కుతుబ్ షా 1626-1672; అబుల్ హాసన్ కుతుబ& సా (తానీషా) 1672-1687.**

దానికి, నేను పదేళ్ల కిందనే ఒక వ్యాసం రాసిన్నయ్యా ఎన్.సి.ల్లో ఎ,బి,సి,డిలు రావాలి. బి.సిల్లాగ అని వ్రాసిన. నువ్వు చెయ్యి అని చెప్పిన. వాళ్లు ఒక్క లాఠీ దెబ్బ తినకుండా రెండు సంవత్సరాల్లో హాయిగా చక్కటి ఉద్యమాన్ని నిర్మించి ఒక ఇమేజ్, రిజర్వేషన్ ఎ.బి.సి.డిలు సాధించడం కాదు అక్కడ ముఖ్యం, అది చాలా చిన్న సమస్య. కానిమాదిగలందర్ని ఇండ్లల్ల కెళ్ళి లాక్కురాగలిగింద్రు. ఇటీవలి ఈ పదేళ్ళల్లో అంత పెద్దగ జనం కదిలినటువంటి ఉద్యమం ఏదీ లేదు. మీరు అబ్జర్వు చేయండి. అంటే మాదిగ అనే పదం ఉచ్చరించడమే ఒక నీచం, కులం తక్కువ అని భావించే స్థితి నుంచి, మాదిగగారు, మాదిగ సాహెబ్, దక్కలి సాహెబ్ అని పిలుచు కునే స్థాయికి దాని గౌరవాన్ని పెంచు కోగలిగారు. అది వాళ్లు ఎట్లా సాధించ గలిగారు. వాళ్లకేమన్న చదు వొచ్చిందా? అసలు నన్నడిగితే ఒక సామెత ఉన్నది. ఏమంటే ఎక్కువ తెలిసినోడే మోసం చేస్తడు. అమాయ కుడికి మోసం చేసుడు వస్తదా? మనం అమాయకులం కాబట్టే వాడు మోసం చేస్తున్నడు. ఎక్కువ తెలిసినోడు అయితే ఈ చదువుకున్నోల్లే నాయకత్వం వహించాలె. తెలంగాన రాష్ట్రం సాధనకు అనుకోవడం తప్పు. ఎందుకంటే మాదిగ దండోరాకి టెన్త్ కూడా చదువుకోలేదు. వాళ్లు ఆరో తరగతి, ఏడో తరగతి చదువుకున్నోళ్లు. వాళ్లు నాయకత్వం వహించి చక్కగా ఐ.ఎ.ఎస్. ఆఫీసర్ల కాంచి మొదలుపెట్టి అందరు రాజకీయ, అన్ని పార్టీల నాయకులతోటి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వాళ్ల నుండి మద్ధతు తీసుకోగలిగింద్రు, ఉద్యమం నిర్మించగలిగింద్రు.

అందువల్ల కొత్త నాయకత్వం తయారుచేసుకో గలగాలి. దానికి మనం ఒక ప్రేరణ నివ్వగలగాలి ఒక టీచరు ఎలిమెంటరీ స్కూల్లోని పిల్లల్ని ఎదిగిస్తే ఆ పిల్లలు ఐ.ఎ.ఎస్‌లు, రాజకీయనాయకులుగా, పెట్టుబడిదారులుగా ఎట్లయితే మారుతున్నారో అట్లే మనం ఇప్పటి తరంను ఎదిగించాలి. యువతరం నుండికొత్త నాయకత్వం కావాలి. ఇప్పుడు నాయకత్వంలో నాకు సెక్రటరీ వస్తదా? ప్రెసిడెంటు వస్తదా? టి.డి.పిలోకి వస్తే వస్తదా? బి.జె.పిలోకి వస్తదా? అని గీ లెక్కలు చూడ్డం కాదు. ఆ లెక్కల్ని పక్కనపెట్టి వారి స్వార్థాలను పక్కకుపెట్టి, జనాన్ని సమీకరించి, దాన్నుంచి నాయకత్వం తయారు చేయాల్సిన అవసరం ఉంది.

(నా తెలంగాణ మాసపత్రిక 1997)

# తెలంగాణ రాష్ట్ర సాధన

(దేవరశెట్టి జనార్దన్ 'ముక్కోటి తెలంగాణ' కవితా సంపుటికి నేను రాసిన ముందుమాట ఇది. తెలంగాణ రాష్ట్ర ఉద్యమం వ్యూహం మలుపు తిరగడానికి ఈ ముందుమాట ఎంతగానో ఉపయోగపడింది. తెలంగాణ రాష్ట్ర సాధన కోసం అఖిలభారత స్థాయిలో అన్ని పార్టీలను సంప్రదించాలని, వాళ్ళ ఎన్నికల ప్రణాళికల్లో చేర్పించాలని, అందుకు ఒక బృందం పర్యటించాలని, పార్లమెంటులో వాళ్ళు మద్దతు తెలిపేవిధంగా కూడగట్టాలని, ఈ ముందుమాటలో, నా ప్రసంగాల్లో చేసిన సూచనలని తీసుకుని టీఆర్ఎస్ ముందుకు సాగింది. కీ.శే.బియ్యాల జనార్దనరావుగారికి తెలంగాణ రాష్ట్ర ఉద్యమం గురించి పలు సూచనలు చేయడం జరిగింది. ఈ పుస్తక ఆవిష్కరణకి మాజీ వైస్ చాన్సలర్ డా. జయశంకర్, బియ్యాల జనార్దనరావు విచ్చేశారు. అప్పుడే ఎన్నికైన కరీంనగర్ జిల్లా పరిషత్ చైర్మన్ కె.వి. రాజేశ్వరరావు ఈ పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఆ పుస్తకం నుండి కొన్ని భాగాలు.)

భారతదేశంలో స్వాతంత్ర్యానికి పూర్వం ఉండిన 600 సంస్థానాల్లో అతిపెద్ద సంస్థానం నైజాం రాజ్యం. అలాంటి నైజాం రాజ్యం కనీసం ఒక్క రాష్ట్రంగా మిగలకుండా ముక్కలు ముక్కలుగా చేయబడి ఇతర రాష్ట్రములలో కలపడం ఒక విషాదం. వేల యేళ్ళ చరిత్ర గలిగినట్టి ఈ ప్రాంతాన్ని రజాకార్ల భయంతో కమ్యూనిస్టుల భయంతో, భూస్వాముల అణచివేతతో రకరకాల భయాందోళనల్లో తెలంగాణాను ఆనాటి పెద్దలు ఆంధ్రప్రదేశ్‌లో కలపడానికి సంసిద్ధులయ్యారు. నెహ్రూ, అంబేద్కర్‌తో సహా కొందరు పెద్దలు దీనిని వ్యతిరేకించిన విషయం మనం మరువద్దు...

**కాశ్మీర్, తెలంగాణ, నేపాల్, భూటాన్, సిక్కిం, గోవా సమస్యకు గల సంబంధం :**

తెలంగాణా అనే పదం చాలామంది ఉర్దూ నుండి రూపొందినది అనుకుంటున్నారు. కానీ, బుద్ధుని కాలం నుండే ఇక్కడ 'తెలాంగ్' పేరుతో బౌద్ధ భిక్షువులు ఉండేవారు. 'త్రిలింగ' పదము నుండి 'తెలంగ' అనే పదం రూపొందినదని భావించడం సబబు కాదు. కళింగ, తెలంగ ఇలాంటి రాజ్యాలుండేవి. తెలంగ అనే పదమే తెలుగు భాషగా మారింది. తెలంగాణాకు ప్రత్యేకమైన చరిత్ర, సంస్కృతి, భాషలున్నాయి. హిందీలో భోజ్‌పురి ఎలా ప్రత్యేక భాషగా ఉందో, ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణా తెలుగు భాష కూడా ప్రత్యేకమైనది. తెలంగాణా సంస్కృతి ఉత్తర భారతదేశానికి, మహారాష్ట్రకు సమీపంగా ఉంటుంది. కోస్తా, ఆంధ్ర సంస్కృతి దీనికి విడిగా ఉంటుంది. తెలంగాణా సంస్కృతి ఉత్తర భారతదేశంలోని పండుగలతో కలిసిపోయి సమ్మిళితంగా ఉంటుంది. లక్నోలో, హైదరాబాద్‌లో ఒకే రకమైన సంస్కృతి – నాగపూర్‌లో, కరీంనగర్ లో ఒకేరకమైన సంస్కృతి ఉంటుందని ఎందరికి తెలుసు?



గోలకొండ పతనము, మొగలుల వశం వారి పరిపాలన క్రీ.శ. 1687-1724;
ఔరంగజేబు 1687-1707; బహద్దూర్ షా 1707-1712; జహాందార్ షా - 1712 - 1713; ఫర్రూక్ సయ్యర్ 1713 - 1719: రఫీయుద్దరాజత్ 1719; రఫీయుద్దౌలా 1719; ముహమ్మద్ షా 1719 - 1724. క్రీ.శ. 1724లో నిజాముల్‌ముల్క్ ముబారిజ్ ఖాన్‌ను ఓడించి అసఫ్‌జాహీల వంశ పాలనకు శ్రీకారం చుట్టాడు.

తరతరాలుగా తెలంగాణారాజ్యం ఒక స్వతంత్ర రాజ్యంగా ఎంతగానో ఎదగాలను కున్నది. కానీ స్వాతంత్ర్యానంతరము ఒక వలసరాజ్యంగా మారిపోయినది. నైజాం రాజు తూర్పు, పశ్చిమ పాకిస్తాన్‌ల లాగా, సిక్కిం, భూటాన్, నేపాల్ లాగా ఒక స్వతంత్ర దేశంగా నిలపాలని ఆశపడ్డాడు. నిజంగా అతని ఆశ సహృదయంతో అర్థం చేసుకుంటే అందులో అనౌచిత్య మేమీ లేదు. సరియైన సముద్రతీరం లేకపోవడం వల్ల, నిజాంపట్ల ప్రజలకున్న వ్యతిరేకత వల్ల ఆయన కల సుసాధ్యం కాలేదు. ప్రత్యేక రాష్ట్రం కానపుడు కనీసం కాశ్మీర్ ప్రజల హక్కుల, ఆస్తుల రక్షణకోసం రాజ్యాంగంలోని 371 ఆర్టికల్‌నైనా తెలంగాణాకు వర్తింపజేసి ఉండాల్సింది.

1953లో కర్నూలు రాజధానిగా ఏర్పడ్డ ఆంధ్రరాష్ట్రం అలాగే కొనసాగి ఉండాల్సింది. వాళ్లు మద్రాసు రాష్ట్రంలో అనుభవిస్తున్న వివక్షతకు బాధపడి ప్రత్యేక రాష్ట్రం కోరుకున్నారు. చెన్నపట్నంను కూడా ఆంధ్రరాష్ట్రంలో కలపాలనుకున్నారు. బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ఉన్న నైజాం రాష్ట్రం, నిజానికి అది తెలంగాణా రాష్ట్రం. ఈ తెలంగాణా రాష్ట్రమును రద్దు పరచి, మద్రాసు రాష్ట్రం నుండి విడిపోయిన ప్రాంతంతో కలిపేసారు. ఇది ఒక అసహజమైన కలయిక. కమ్యూనిస్టులు ఆంధ్ర ప్రాంత నాయకులు కావడం వల్ల, తెలంగాణాను ఆంధ్రాలో కలపాలని ప్రచారం చేసారు. దానివల్ల తుదకు వాళ్ళే నష్టపోయారు. తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంగా ఉండి ఉంటే, కేరళ రాష్ట్రానికి ముందే తెలంగాణాలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడి ఉండేది. టంగుటూరి ప్రకాశం పంతులును తమ పార్టీ కాకపోయినా తీసుకువచ్చి ముఖ్యమంత్రిని చేసి కాంగ్రెస్ పార్టీ కమ్యూనిస్టులకు గండికొట్టింది.

**నెహ్రూ – అంబేద్కర్‌లు భాషా రాష్ట్రాలను వ్యతిరేకించారు :**

నెహ్రూ, అంబేద్కర్ భాషా ప్రయుక్త రాష్ట్రాలను వ్యతిరేకించారు. కొన్ని అభివృద్ధి చెందిన కులాలు ఇతర ప్రాంతాలను వలసలుగా మార్చుకోవడానికి ఉపయోగ పడుతుందని ఆనాడే హెచ్చరించారు. అంబేద్కర్ రిజర్వేషన్ల సిద్ధాంతకర్త. వెనుకబడిన ప్రాంతాలు రిజర్వేషన్ల పద్ధతిలో అభివృద్ధి పరచుకోవాలనే కోరుకున్నాడు. రాష్ట్రాల పునర్విభజన ఈ దేశంలో గిరిజనుల కు తీరని అన్యాయం చేసింది. వారి రాజ్యాలు ప్రాంతాలు ఆయా రాష్ట్రములకు సరిహద్దులుగా మార్చబడ్డాయి. రాజ్యానికి, గిరిజనులకు మధ్య దూరం పెరిగిపోయింది. గిరిజనులను అనుసరించి వారి భాషను అనుసరించి, రాష్ట్రముల పునర్విభజన చేసి ఉంటే రాష్ట్రముల ఏర్పాటు ఇప్పుడున్న విధముగా ఉండేవి కావు, ఉండవు.

**సమైక్యతావాదులు 40 ఏళ్ళు తెలంగాణ రాష్ట్రం అని పిలవాలె :**

తెలంగాణా ఆంధ్రప్రదేశ్‌లో కలిసాక, తెలంగాణా తన అస్తిత్వమే కోల్పోయింది. చివరికి కొందరికి తెలంగాణా పదమే ఉచ్ఛరించడానికే అంటరాని పదమైపోయింది. ఆంధ్రప్రదేశ్ అనే పదానికి బదులుగా తెలంగాణా రాష్ట్రం అని ఉంటే తెలంగాణా ఆత్మగౌరవం ఎంతగానో పెరిగి, ఆంధ్ర పేరు కనుమరుగై ఉండేది. తెలంగాణా తన పేరునే వదిలేసుకుంది. పేరును వదిలేసుకున్నాక, చరిత్ర మాత్రం ఎలా మిగులుతుంది? పేరులేని వారు చరిత్రను మిగల్చలేరు. నేను గత ఆరేళ్ళుగా సమైక్య ఆంధ్రప్రదేశ్‌ను కోరేవాళ్ళకు ఒక విజ్ఞప్తి చేస్తున్నాను. గత నలభై ఏళ్ళు ఆంధ్ర అన్న పదంతో రాష్ట్రాన్ని పిలుస్తున్నారు. ఇకనుండి "తెలంగాణా రాష్ట్రం" అని పిలువడానికి తగిన సవరణలు చేయండి. ఒక నలభై ఏళ్ళు తెలంగాణా రాష్ట్రంగా పిలుస్తూ, పాఠ్యపుస్తకాలు, రేడియో, టి.వి., సినిమా రంగాల్లో తెలంగాణా భాషలో వ్రాయడం, మాట్లాడడం జరగాలి. ఆంధ్రప్రదేశ్‌కు తెలంగాణా రాష్ట్రమని పేరుపెట్టాలని ఇప్పటి వరకు ఏ రాజకీయ పార్టీ తీర్మానం చేయలేకపోయింది. కోస్తాంధ్ర నాయకులకు ప్రజలకు తెలంగాణా రాష్ట్రమనే పేరే సహించనపుడు తెలంగాణా పేరునే గుర్తించ నిరాకరిస్తున్నపుడు వాళ్ళు తెలంగాణాకు మేలు ఎలా చేయగలరు? సాధ్యం కాదు.

స్వర్ణాంధ్ర ప్రదేశ్ కాదు ఇకపై **"తెలంగాణా"** అని పిలవడం సమైక్య వాదుల ముందున్న మొదటి కర్తవ్యం.

తెలంగాణా జిల్లాలతో కూడుకున్న ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే, అది ప్రపంచంలోని చాలా దేశాల కన్నా పెద్దదిగాను, దేశంలో సగం రాష్ట్రముల కన్నా పెద్ద రాష్ట్రంగాను అవతరిస్తుంది. చిన్న రాష్ట్రములైన హర్యానా, పంజాబ్, ఢిల్లీ, కేరళలాగ ఎంతో అభివృద్ధి చెందుతుంది. తెలంగాణా ఏర్పడితే, ప్రతి జిల్లాలో విద్యా, వైద్య, వాణిజ్య, పారిశ్రామిక, వ్యావసాయిక, సాంస్కృతిక, కళా రంగాలలో సత్వర అభివృద్ధి జరుగుతుంది.

**మద్రాసీ ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం ఎందుకు కావాలో**
**అందుకే తెలంగాణ రాష్ట్రం కూడా కావాలె :**

మద్రాసు రాష్ట్రం నుండి ఆంధ్ర ప్రాంతం విడిపోయి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కావాలని ఎందుకైతే ఆనాటి ఆంధ్రులు కోరుకున్నారో, సరిగ్గా అవే కారణాల రీత్యా "తెలంగాణా రాష్ట్రం" అవసరం. దూరదృష్టి లేనితనం అమాయకత్వం, బోళాతనం వల్ల తెలంగాణాలో కొందరు ఆంధ్రరాష్ట్రంతో కలిసిపోవడానికి అంగీకరించారు. అందుకు వాళ్ళే మూల్యం కూడా చెల్లించారు. ఇవాళ ప్రకాశం పంతులు, నీలం సంజీవరెడ్డి, రాష్ట్ర పూర్వ ముఖ్యమంత్రులని తెలుసు. కానీ, బూర్గుల రామకృష్ణారావు పూర్వ ముఖ్యమంత్రి అని తెలియకుండా చేయబడింది. తెలంగాణా వారికి అసలు సరిగా భాషనే రాదనేదాక, వారికి సంస్కృతి, చరిత్ర లేదనేదాక, ఆంధ్ర పాలకులకు దురహంకారం ప్రబలింది. చివరకు తెలంగాణా పదమే అస్పృశ్యతకు లోనైంది.

మొత్తంగా 34 సంస్థలు కలిసి కట్టుగా తెలంగాణా రాష్ట్రంకోసం చేసిన కృషి సామాజిక భావజాల రంగంలో విప్లవాన్ని సృష్టించింది. మీనమేషాలు లెక్కించే రాజకీయ



**అసఫ్‌జాహీ నిజాం రాజులు**
**(క్రీ.శ.10.10.1724-17.09.1948)**
**నిజాముల్ ముల్క్ అసఫ్‌జా 1724 - 1748; నాసర్‌జంగ్ 1748-1750; ముజఫర్ జంగ్ 1750-1751; సలాబత్ జంగ్ 1751 - 1762; నిజాం అలీఖాన్ 1762-1803; సికిందర్‌జా 1803 - 1829; నాసిరుద్దౌలా 1829-1857; అఫ్జలుద్దౌలా అసఫ్ జా 1857 - 1869; మీర్ మహబూబ్ అలీఖాన్ 1869-1911; మీర్ ఉస్మాన్ అలీఖాన్ అసఫ్‌జా 1911-1948.**

నాయకులు కొందరు అదను చూసుకుని సరైన నిర్ణయం తీసుకున్నారు. వారికున్న రాజకీయ పరిజ్ఞానం ద్వారా అత్యంత స్వల్పకాలంలో కరీంనగర్‌లో పెద్ద ఎత్తున బహిరంగ సభ నిర్వహించి, తెలంగాణా పోరాట యోధులను సమీకరించగలిగింది. కరీంనగర్ జిల్లా నుండి ఆర్. పాపారావు, దేశిని చిన్నమల్లయ్య, కెప్టెన్ లక్ష్మీకాంతారావు తదితర శాసన సభ్యులు తెలంగాణా రాష్ట్ర సమితి వ్యవస్థాపకులు చంద్రశేఖర్ రావు గారితో కలిసి ఉద్యమించడానికి సిద్ధంగా ఉన్నారు.

**పార్లమెంటరీ పార్టీలన్నిటిని ఒప్పించే విధంగా దేశమంతా పర్యటించాలి :**

ఆవేశంలో, ఆవేదనలో మౌలికాంశములు మరిచిపోవద్దు. తెలంగాణలో ఉద్యమాలు పెద్దగా అవసరం లేదు. 1969 ఉద్యమంతోనే ప్రజలు తమ నిర్ణయాన్ని ఎప్పుడో చెప్పారు. తెలంగాణా రాష్ట్రం ఏర్పడడానికి పార్లమెంట్ పూనుకోవాల్సి ఉంటుంది. అందుకని పార్లమెంటరీ పార్టీలన్నిటినీ చిన్న రాష్ట్రాల ఆవశ్యకతపై ఒప్పించి, వారి ఎన్నికల మేనిఫెస్టోలో చేర్పించాలి. అందుకుగాను విస్తృతంగా దేశవ్యాప్తంగా పర్యటించి అక్కడి ప్రజల మద్దతు కూడగట్టుకోవాలి. అదే క్రమములో ఆంధ్ర ప్రాంతములో తెలంగాణాను వ్యతిరేకించే బ్రాహ్మణ, కమ్మ, కాపు, రెడ్డి, నాయుడు వంటి కొన్ని కులాల కోసం భూస్వాముల, పారిశ్రామికవేత్తల నాయకుల స్వార్థం కోసం, మనల్ని సమర్థించే బి.సి., ఎస్సీ, ఎస్టీ ప్రజల మనోభావాలకు దూరం కాకుండా వ్యవహరించాలి. కవుల, రచయితల, కళాకారుల మద్దతు కూడగట్టుకోవాలి. తె.రా.స. ఏర్పడి ఎన్నికల సంఘం గుర్తింపు పొంది, సంస్థాగత ఎన్నికల్లో రాజకీయ రంగంలో ప్రవేశించి, ప్రజలను ఉద్యమం వైపు కదిలిస్తున్నది.

**ఉమ్మడి కుటుంబాలు విడిపోయినై, కమ్యూనిస్టులు కలసివుండరు**
**కానీ తెలంగాణ కలసి వుండాల్నా :**

మనసులు కలువని భార్యాభర్తలు విడిపోతున్నారు. ఒక తల్లి కన్నబిడ్డలే వేరు కుంపటితో సంసారాలు చేస్తున్నారు. మార్క్స్ పేరు చెప్పుకుంటూనే రెండంకెలకు మించి కమ్యూనిస్టు పార్టీలు వేరు వేరు కుంపట్లు నడుపుకుంటున్నారు. వాళ్ళు కలిసి ఉండలేరట గాని, భౌగోళికంగా విడిగా ఉన్న తెలంగాణా మాత్రం ఆంధ్ర వలస ఆధిపత్యంలో కలిసి జీవించడం ఎందుకు?.

"మమ్మల్ని మేము నిర్మించుకోవాలనుకుంటున్నపుడు ఇతరులకెందుకు ఆక్షేపణ?....." ఇలా మరిచిపోతున్న మానవ హక్కులను వారికి గుర్తు చేయడం అవసరం.

# తెలంగాణాలో ప్రజాస్వామ్యం

(తెలంగాణలో నిర్బంధం పెరుగుతున్నప్పుడు, ఎన్నికలు రాకముందు నక్సలైట్ల సమస్యలను పరిష్కరించడానికి తెలంగాణ ప్రజలు శాంతియుతంగా జీవించడానికి రాజ్యాంగబద్ధంగా సాధ్యమయ్యే పరిష్కారాలను చర్చిస్తూ 'వార్త' దినపత్రికలో ప్రచురించిన వ్యాసం పూర్తిపాఠం ఇది.)

నక్సలైట్లు ప్రభుత్వానికి మధ్య జరిగే చర్చల్లో – తెలంగాణాలో ప్రజాస్వామ్య వ్యవస్థ సక్రమ నిర్వహణ, సామాజికాభివృద్ధి, పౌర హక్కులు, స్వేచ్ఛ, సమానత్వం, పునాది అంశంగా ఉండాలి. ఈ రెండు పక్షాల్తో పాటు సమస్త పార్టీలు, ఉద్యమాలు ఇందుకనువుగా ప్రజల ముందు వినయంగా తల వంచి తమ తమ మెట్లను దిగివచ్చి వ్యూహం, ఎత్తుగడలను, అవగాహనలను, సవరించి, సంస్కరించుకోవడం అవసరం.

**తుమ్మితే ఊడిపోయే ప్రభుత్వాలకోసం సాయుధ పోరాటాలా? :**

ప్రజల ఓట్లతో ఎన్నికై అయిదేళ్ళ తర్వాత ఉంటారో, పోతారో తెలియని పాలకులు, శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు సైతం వంశ పారంపర్య శాశ్వత రాజుల్లాగా ప్రజా ఉద్యమాల పట్ల ప్రవర్తించడమే చాలా సమస్యలకు మూలం. ఆయుధాలు పట్టుకుంటే తప్ప వినని ప్రభుత్వం తీరు తెన్నులు మారాలి. విద్యుత్ రెట్ల తగ్గుదల ఉద్యమంలో, కాంగ్రెస్ శాసన సభ్యులు మూకుమ్మడి నిరాహార దీక్ష పూనారు. వామ పక్షాలు చట్టబద్ధ ఉద్యమాలు చేశాయి. వీటి వల్ల ఫలితం లేకపోవడం అనేది ప్రజాస్వామిక పద్ధతుల్ని ప్రభుత్వం నిర్వీర్యం చేయడాన్ని తెలుపుతున్నది. బ్రిటీష్ ప్రభుత్వం చట్టబద్ధ ఉద్యమాల పట్ల ఇలాగే నిర్లిప్తంగా ఉండి ఉంటే స్వాతంత్ర పోరాటం శాంతి యుతంగా కాకుండా సాయుధంగానే సాగి ఉండేది.

ఆయుధ బలగాల ద్వారా, ప్రసార, ప్రచార సాధనాల ద్వారా ప్రజల చైతన్యాన్ని, ఆకాంక్షల్ని, ఉద్యమాల్ని అణిచివేసే పద్ధతుల వల్లనే ప్రజలు కూడా ఆయుధ ధారణ పట్ల మొగ్గు చూపుతున్నారు. దేవుళ్ళు ఆయుధ ధారులు కావడం వల్ల దుష్ట శిక్షణకు తామే అవతారం ఎత్తాల్సి వచ్చిందని ప్రజలు ఉత్సాహాన్ని పొందుతున్నారు.

ప్రజా ఉద్యమాలను వాటి తోవన వాటిని సాగనిస్తే సమాజం ముందుకు సాగుతుంది. ప్రజా ఉద్యమాలు లేకపోతే సమాజం గిడస బారుతుంది. ప్రభుత్వం తటస్థంగా పెద్ద మనిషి తరహాలో ఉంటూ ప్రజా ఉద్యమాల్ని సాగనిస్తే ప్రజా ఉద్యమాలు వర్గాల మధ్య, సమాజ అభివృద్ధి శక్తుల మధ్య సాగుతుంది. ప్రభుత్వం తటస్థంగా ఉంటూ మధ్యవర్తి పాత్ర నిర్వహిస్తే సామాజిక అభివృద్ధి, నూతన చైతన్యం, నూతన విలువలు, సంస్కృతి వ్యాప్తి చెందుతాయి. బ్రిటీష్ వారి కాలంలో రాజా రామ్మోహన్‌రాయ్, మహాత్మ జ్యోతి బాపులే, గాంధీ, కందుకూరి వీరేశలింగం,



డా॥ అంబేద్కర్, తదితరుల హిందూ సంస్కరణ వాదాల్లో భారతీయ సమాజ సంస్కరణల్లో బ్రిటీష్ ప్రభుత్వం ప్రగతిశీల శక్తులకు మద్దతుగా ఎన్నో చట్టాలను చేసింది. చివరకు చట్ట సభలను కూడా తానే ఏర్పాటు చేసింది. తద్వారా బాల్య వివాహాలు, సతీ సహగమనం, అంటరాని తనం తగ్గిపోయాయి. పరిపాలనలో తర్ఫీదు దొరికింది. రిజర్వేషన్లు లభించాయి.

**ముప్పయి లక్షల జనాభా, ముప్పై మంది ఎమ్మెల్యేలకు గోవా రాష్ట్రం - 3 లక్షల జనాభా, ఒక ఎంపీ గల వారికి సిక్కిం రాష్ట్రం 5 కోట్ల తెలంగాణా ప్రజలకు, 105 ఎమ్మెల్యేలకు ఒక రాష్ట్రమైనా ఎందుకు లేకుండాపోయింది? క్రీ.శ.1724 నుండి 1948 వరకు నిజాం పరిపాలనలో స్వతంత్ర దేశంగా ఉండి 1948 నుండి 1956 వరకు స్వతంత్ర రాష్ట్రంగా ఉన్న హైదరాబాద్ రాష్ట్రం 1956 నవంబరు నుండి సామంతరాజ్యంగా ఎందుకు మారింది?**

**వివేచనాత్మక మద్దతు ఇవ్వడంద్వారా సామాజికాభివృద్ధి సాధించాలి :**

ప్రగతిశీల శక్తులకు సంస్కరణ వాదులకు ఇలా ప్రభుత్వం మద్దతు యిచ్చినపుడు సమాజం వేగంగా ముందుకు సాగుతుంది. మద్దతు ఇవ్వకపోయినా వాటిని అణిచి వేయకపోతే చాలు అవి సమాజ అభివృద్ధిని ముందుకు తీసుకుపోతాయి. ఫెమినిస్టులు సమాజాభివృద్ధిని ముందుకు తీసుకు పోవడంలో, ప్రభుత్వాల ద్వార కూడా అమలు చేయించడంలో ముందున్నారు. అన్నిటికీ కావాల్సింది పాలనాధికారంలో ఉన్న పార్టీల్లోను, ప్రజా ఉద్యమ నాయకుల్లోను కాస్త స్వార్థ త్యాగం, వచ్చే ఎన్నికల్లో తాము గెలవకపోయినా చరిత్రలో మిగిలే గొప్ప కార్యాలు చేశాం అనే అత్యున్నత ఆశయాలు ప్రభుత్వాలకు పార్టీలకున్నప్పుడు యిది సాధ్య పడుతుంది.

**చరిత్రలో నిలిచిపోవాలనుకునే నాయకులకు గొప్ప అవకాశాలు :**

వి.పి. సింగ్ బీసీ రిజర్వేషన్లకు, ఆమోద ముద్ర వేసినందుకు ప్రధాని పదవిపోయినా చరిత్రలో మిగిలిపోయారు. రాష్ట్ర ప్రభుత్వాలు కూడా యిలా చరిత్రలో స్థానం సంపాదించుకునే అవకాశాలెన్నో ఉన్నాయి. భూసంస్కరణల్ని ఏడాది లోగా అమలు పరిచి భూమి లేని ఎస్సీ, బీసీలను సన్నకారు రైతులుగా ఎదిగించ వచ్చు. ఇందుకు చట్టాల కొరత లేదు. చిత్తశుద్ధి చాలు. భూమిని ఆస్తిగా కాకుండా వృత్తిగా భావించి చట్టాలు చేస్తే చాలా మంది ఉద్యోగాలైనా వదులుకుంటారు, భూములైనా వదులుకుంటారు. బ్యాంకులను జాతీయం చేసి రాజభరణాలు రద్దుచేసి ఇందిరాగాంధీ చరిత్రలో మిగిలిపోయారు.

**సేవలు, సంక్షేమ పథకాలు తగ్గిస్తే పన్నులు కూడా తగ్గించాలి :**

ప్రభుత్వం తన సేవలను, సంక్షేమ శాఖలను, వాటి బడ్జెట్లను తగ్గిస్తున్నది. అందువల్ల ఆమేరకు నిరంతరం పన్నులు తగ్గించడం అవసరం, పన్నులు తగ్గించడం కోసం ఉద్యమాలు అవసరం. ఉచితంగా సేవ చేయని ప్రభుత్వానికి పన్ను కట్టనవసరం లేదు.

**1969లో తెలంగాణ రాష్ట్రం ఏర్పడివుంటే నక్సలైట్ ఉద్యమం ఉండేదికాదు :**

1969లో వచ్చిన ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర ఉద్యమం ద్వారా తెలంగాణ రాష్ట్రం ఏర్పడి వుంటే తెలంగాణాలో నక్సలైట్ల సమస్య ఉత్పన్నమయ్యేది కాదు. వామ పక్ష చైతన్యం బలపడి వుంటే పశ్చిమ బెంగాల్‌లాగా వామ పక్ష పార్టీల ఐక్య సంఘటన ప్రభుత్వం ఏర్పడి వుండేది. బెంగాల్‌లో ఆవిర్భవించిన నక్సలైట్ ఉద్యమం ప్రస్తుతం బెంగాల్‌లో లేనట్టే తెలంగాణాలోనూ నక్సలైట్ ఉద్యమం ఉండేది కాదు. ప్రగతిశీల శక్తుల చేతుల్లోకి అధికారం త్వరలోనే బదిలీ అయివుండేది.

**నక్సలైట్ల ప్రణాళికలు - చేస్తున్న అభివృద్ధి ఏది?**

అలా కాకుండా ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని నడపాలనుకుంటున్న నక్సలైట్లు ప్రజలకు సామాజిక అభివృద్ధి ఇంతకన్నా వేగంగా, నిజాయితీగా, చైతన్య యుతంగా అందించాలి. అందుకు ప్రణాళికలున్నాయా? ఉంటే ప్రజల ముందు పెట్టాలి. విద్య, వైద్య, సేవా తదితర సంస్థలు ఎన్నో పెట్టాలి. నడపాలి. ఇందుకు ఆరెస్సెస్ పరివార్ కార్యక్రమాల నుండి, శంకర్ గుహనియోగి ప్రయోగాల నుండి నక్సలైట్లు ఎంతో నేర్చుకోవాల్సి ఉంది. శత్రువు నుండి నేర్చుకోవడం వల్లనే శత్రువుని ఓడించడం సాధ్యం. అందుకే లెనిన్ అమెరికన్ పనిశైలి, బోల్షివిక్ స్పిరిట్ ఉండాలన్నాడు.

**నక్సలైట్లు పేదరికాన్ని పెట్టుబడిగా మార్చుకుంటున్న తీరు :**

పేదరికంతో ఆకలితో అల్లాడే ప్రజలను ఆధునిక సమాజంగా ఎదిగించాలి, వారి ఆకలి పేదరికం పెట్టుబడిగా చేసుకొని ఈ మొత్తం సామాజిక వ్యవస్థను మార్చాల్సిన భారాన్ని వారి ఆకలి పేదరికం మూలుగులపై మోపడం సరైనది కాదు. నక్సలైట్ ప్రభావిత ప్రాంతాల్లో ప్రభుత్వం కన్నా వేగంగా అక్కడి ప్రజల సర్వతో ముఖాభివృద్ధి జరిపించి చూపినపుడే అది నిజంగా సామాజిక ఉద్యమం అవుతుంది. అంత దాకా అది కొందరి భావ జాలానికి సాధనగా, లక్ష్యంగా మారి కొనసాగుతున్నట్టవుతుంది.

**నక్సలైట్లు ఉన్న ప్రాంతాల్లో ఏపాటి మెరుగ్గా ఉన్నారు :**

తెలంగాణాలో ప్రభుత్వ శాఖలు, ఉద్యోగులు ఇతర ప్రాంతాల కన్నా ఏ మాత్రం మెరుగ్గా లేరు. చాలా చోట్ల ఇతర ప్రాంతాల కన్నా నీచంగా అవినీతి మయంగా, అహంకారం అధికారం చెలాయిస్తున్నారు. నక్సలైట్లు వీరిని ప్రజల వైపు వంచే కార్యక్రమాలు తీసుకోవాలి.

పోలీసు శాఖలో ఇతర శాఖలలో వలె సైన్యంలో వలె ఉద్యోగుల్ని అయిదు సంవత్సరాల కాంట్రాక్టు పై నియమిస్తూ రెగ్యులర్ పోలీసు వ్యవస్థను తొలగించాలి. 15 ఏళ్ళకు మించి ఎవరూ సర్వీసులో లేకుండా ఉంటే వారు మళ్ళీ ప్రజల్లోకి వచ్చి బతకాల్సిన అవసరం రీత్యా ప్రజల మధ్య జీవించే సంస్కృతిని డ్యూటీలోనూ ఆచరిస్తారు.



**పోలీసులకు మానసిక స్వస్థత కలిగించాలి :**

ఆత్మ రక్షణ కోసం చంపినా సరే, లాకప్పులో చంపినా సరే ప్రజల్ని గానీ, నక్సలైట్లను గానీ చంపిన పోలీసులను, పోలీసు అధికారులను రెండేళ్ళ పాటు విధిగా సస్పెన్షన్‌లో ఉంచాలి. తద్వారా మనిషిని చంపిన క్షోభ కొంత వారిలో తగ్గుతుంది. రెండేళ్ళ తర్వాత విచారణ లో తప్పు లేదని తేలితే యధావిధిగా ఉద్యోగం పూర్తి జీతభత్యాలతో యివ్వాలి. ప్రజల ప్రాణాల కన్నా పోలీసుల ఉద్యోగాలు, సస్పెన్షన్లు గొప్పవేమీ కావు.

**తెలంగాణా తెలంగాణా వారిదే. కోల్పోయిన స్వతంత్ర రాష్ట్ర ప్రతిపత్తిని తిరిగి సాధించండి. తెలంగాణాలో ఎవరైనా బతకొచ్చు. అన్ని ఉద్యోగాలు, అన్ని వనరులు తెలంగాణా వారివే. తెలంగాణా రాష్ట్రం తిరిగి స్వతంత్ర ప్రతిపత్తిని పొందడాన్ని వ్యతిరేకించేవారు తెలంగాణా ప్రజల వ్యతిరేకులే. తెలంగాణా భాష పరిరక్షణకు ఉద్యమించండి. తెలంగాణా భాషతోనే తెలంగాణా సంస్కృతి, తెలంగాణా జీవితం కొనసాగుతున్నది.**

తెలంగాణాలో రోజువారీ ఈతిబాధలు స్థానికేతరులకు అర్థం కావు. తెలంగాణా శాసన సభ్యులతో ప్రత్యేకంగా తెలంగాణా (ఫోరం) శాసన సభ నిర్వహించబడాలి. ఈ ఫోరం సూచనలు, తీర్మానాలు రాష్ట్ర శాసన సభ సూచనల్లాగే చట్టబద్ధం అయ్యే ఏర్పాటు చేయాలి. పశ్చిమ బెంగాల్‌లో సుభాష్ ఘీషింగ్ డార్జిలింగ్ జిల్లాకి ఉప రాష్ట్ర ప్రతి పత్తి కొనసాగుతున్న రీతిలో ఉండాలి. ఇలా తెలంగాణా శాసన సభ్యులు విడిగా శాసన సభను నిర్వహించుకునే ఏర్పాటును తెలంగాణా డెవలప్‌మెంట్ ఫోరం వంటి ఏ పేరుతోనైనా కొనసాగించుకోవచ్చు.

నక్సలైట్లు ముందుకు తీసుకువచ్చే సామాజిక శక్తుల అభివృద్ధి కోసం వారు వాస్తవాల దృష్టితో ఎన్నికల బహిష్కరణ కాకుండా ఎన్నికల్లో 5 ఏళ్ళ కనీస కార్యక్రమ ఒప్పందంతో ఆయా ఎన్నికల్లో అభ్యర్థుల వారిగా, పార్టీల వారిగా (గెలవగలిగే అభ్యర్థులకు మాత్రమే) మద్దతు యివ్వడం ద్వారా నక్సలైట్లు ప్రెషర్ గ్రూపుగా, ఓట్ల బ్యాంకుగా ఎనలేని శక్తిని సాధించుకుంటారు. అందువల్ల వాళ్ళు నిలబడక పోయినా మద్దతు యిచ్చి ప్రచారం నిర్వహిస్తే ఎన్నికల తర్వాత ఉద్యమాల పట్ల అణిచివేత చాలా మేరకు తగ్గి పోతుంది. ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వ స్థాయిలో నక్సలైట్లకు, ప్రభుత్వానికి జరుగుతున్న చర్చలే నిర్దిష్ట నియోజక వర్గాల వారీగా సాధించుకోవడానికది చట్టబద్ధ అవకాశాలని ఇస్తుంది. తద్వారా ప్రతి పార్టీ ప్రజలకు, నక్సలైట్లకు అనుకూలంగా మరింత దగ్గరయ్యే కృషి చేస్తుంది. అలా చేయలేక ఎన్నికల బహిష్కరణ పేరిట భూస్వామ్య శక్తులు, దోపిడి కులాల వాళ్ళు గెలవడానికి విప్లవ పార్టీలోని శక్తులు పరోక్షంగా పని చేస్తున్నాయని భావించాల్సి వస్తుంది.

తెలంగాణాలో ప్రత్యేక అభివృద్ధి పథకం కింద ప్రతి తాలూకా స్థాయిలో ఎస్సీ, బీసీ, ఎస్టీ విద్యార్థులకు, బాలలకు ఒక్కొక్కటి చొప్పున మూడు, బాలికలకు

మూడుచొప్పున రెసిడెన్షియల్ ఉన్నత పాఠశాలల్ని అదనంగా ప్రారంభించాలి. వాటికి అనుసంధానంగా జూనియర్ కాలేజీల్ని కూడా ఏర్పాటు చేయాలి.

**హాస్టళ్ల కొరతతో నక్సలైట్ల పెరుగుదల :**

ఎస్సీ, బీసీ, ఎస్టీ విద్యార్థుల కోసం ఉన్న కాలేజీ హాస్టల్స్‌ను 1986లో ఎత్తేశారు. తద్వారా డ్రాపవుట్స్ పెరిగి విద్యాధికుల సంఖ్య పడిపోయింది. జూనియర్ కాలేజీ నుండి పి.జి. దాకా అన్ని స్థాయిల్లో ఎస్సీ, బీసీ, ఎస్టీ విద్యార్థులందరికి ఉచిత హాస్టల్ వసతి కల్పించాలి. తద్వారా పేదరికం సమస్య కాస్త పరిష్కరింప బడుతుంది. అగ్రకులాలు ఏ రంగంలోనైనా 25 శాతం మించకుండా వారికి రిజర్వేషన్లు పాటించాలి. తద్వారా యితర కులాలు అభివృద్ధి చెందుతాయి. అసమానతలు తగ్గుతాయి. బీసీ, ఎస్సీ, ఎస్టీ కులాల కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 70 శాతం బడ్జెట్లని కేటాయించాలి. ఇప్పుడు పదిహేను శాతం కూడా కేటాయించడం లేదు. ఈ సంవత్సరం రాష్ట్ర బడ్జెట్ 45 వేల కోట్లు అందులో బీసీ, ఎస్సీ, ఎస్టీలకు కేటాయించింది 7 వందల కోట్లు మాత్రమే. జనాభా నిష్పత్తి ప్రకారం 35 వేల కోట్ల రూపాయల బడ్జెట్‌ను కేటాయించాలి. అప్పుడు సమస్యలన్ని పరిష్కారం అవుతాయి. ఇలా కేటాయించిన బడ్జెట్ నుంచి కేవలం రెండు సంవత్సరాలలో భూమి లేని వాళ్ళకు కుటుంబానికి 5 ఎకరాల భూమిని కొనివ్వవచ్చు. పేదలకు బియ్యం పేరిట ఇచ్చిన సబ్సిడీతో ఇప్పటికి కుటుంబానికి 5 ఎకరాలన్నా భూమి ప్రభుత్వం కొని ఇవ్వగలిగేది. ఈ బడ్జెట్ నుంచి సన్నకారు పరిశ్రమలకు బీసీ, ఎస్టీ, ఎస్సీలకు అప్పులిస్తే 5 సంవత్సరాలలో దేశంలోని ప్రభుత్వ, ప్రైవేట్ భారీ పరిశ్రమల మొదలుకొని సన్నకారు పరిశ్రమలు అన్ని టేకోవర్ పద్ధతులలో బీసీ, ఎస్సీ. ఎస్టీల పరం చేయవచ్చు తద్వారా సామాజిక వర్గాల పొందిక సమూలంగా మార్చవచ్చు.

**తెలంగాణా యూనివర్సిటీ ఏర్పాటు చేయాలి :**

తెలంగాణా అభివృద్ధి కోసం "తెలంగాణా యూనివర్సిటీ" పేర ఒక యూనివర్సిటీ ఏర్పాటు చేయాలి. చేనేత తదితర కుల వృత్తుల, వృత్తి కులాల ప్రజల అభివృద్ధి కోసం కులవృత్తి విద్యల అభివృద్ధి విశ్వ విద్యాలయాన్ని ఏర్పాటు చేయాలి. గిరిజనుల సర్వతో ముఖాభివృద్ధి కోసం ఆదిలాబాద్‌లో కొమురంభీమ్ గిరిజన విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయాలి.

నక్సలైట్ కేసులు మోపబడిన వారందరిని ఏడాది మించితే స్వంత పూచీకత్తుపై బెయిల్ మంజూరు చేసి విడుదల చేసే చట్టం రూపొందించాలి. ఏడాదిన్నర దాటితే కేసులు కాలంతీరిపోయి ఉపసంహరించబడాలి. బేల్‌పై ఉన్నంత కాలంలో వెలుగు పథకం వంటి వాటిలో శిక్షణ యిచ్చి వేతనం పై తీసుకోవాలి.

ప్రభుత్వం నిర్వహించే 'జన్మభూమి', అక్షరాస్యత వంటి కార్యక్రమాల్ని బహిష్కరించడం, ఎద్దేవ చేయడంలో అర్థం లేదు. జన్మభూమి ద్వారా ఎన్నో సమస్యల్ని పరిష్కరించుకునే ఓర్పు, నేర్పు అలవరుచుకోవాలి. గ్రామాలకు తరలండి అని పిలుపు



యిచ్చిన వారే జన్మభూమిని బహిష్కరించడం అనేది ప్రజల మద్దతు, విస్తార ప్రజాశ్రేణులు తన వెంట లేనప్పుడే చేస్తారు.

నక్సలైట్లు భిన్నాభిప్రాయాల్ని వినే భావ ప్రకటనా స్వేచ్ఛను గౌరవించే సంస్కృతి సంస్కారాన్ని అలవరుచుకోవాలి. ప్రజల పట్లనైనా రాజ్యాంగ బద్ధ హక్కులను గౌరవించి ఆచరించాలి. నక్సలైట్లకు హక్కులు, అవకాశాలు లేని మాట నిజమే, కానీ నక్సలైట్లతో విభేధించే వారికి నక్సలైట్లను విమర్శించే అవకాశం తెలంగాణాలో ఉందా? నక్సలైట్లు కూడా తన వ్యతిరేకుల పట్ల ప్రభుత్వ నిర్బంధాల్లాగే ప్రవర్తిస్తోంది. తనని విమర్శించే వారిని ప్రోత్సహించగలగాలి.

**నక్సలైట్ల పరిష్కారాలు – రాయలసీమ ఫ్యాక్షన్ పరిష్కారాలు :**

నక్సలైట్లు చేసే పంచాయితీ పరిష్కారాలు ఫాక్షనిస్టుల తరహాలో, ప్రశ్నించ వీల్లేని తీరులోకి మారి చాలా కాలమైంది. ఏక పక్ష వైఖరి విడనాడి ప్రజల పంచాయితీలు ప్రజలే పరిష్కరించుకొని దానికి కుల సంఘాల, గ్రామ పంచాయితీల పరిష్కారాల వలె చట్టబద్ధత సాధించుకోవాలి. చంపే హక్కు నక్సలైట్లకు లేదు. పోలీసులకు అసలే లేదు. మనుషుల్ని చంపే పద్ధతి విడనాడాలి నాగరిక సమాజంగా ఎదగాలి. తాము ఇతరులను చంపుతు తమను అన్యాయంగా చంపుతున్నారని ఆరోపించడం సరైనది కాదు. చంపే హక్కు ఎవరికి లేదు.

నీ ఆర్థిక వనరుల విధానాలే నీ కార్యక్రమాల్ని నిర్ధేశిస్తాయి. నక్సలైట్ల చందాల బెదిరింపుల వల్ల తెలంగాణాలో అభివృద్ధి పనులు మందగిస్తున్నాయని, ప్రమాణాలు ఉండడం లేదనే ప్రచారంలో నిజం లేకపోలేదు. నక్సలైట్లు డబ్బు కోసం దోపిడి వర్గాల సొమ్ముపై ఆధారపడ్డం మానేసి ప్రజల చందాలపై ఆధారపడితే – అత్యంత సహజ క్రమంలో ఏ పార్టీ అయినా ప్రజలకు దగ్గరవుతుంది. ప్రజల పట్ల జవాబుదారీ తనంతో, సేవా దృక్పథంతో ముందుకు సాగడం సాధ్యమవుతుంది.

**ఐదేళ్ళు అన్ని అవకాశాలిస్తే నక్సలైట్ల సమస్య పరిష్కారం అవుతుంది :**

ఐదేళ్ళు నక్సలైట్లకు అన్ని విధాలా బహిరంగ చట్టబద్ధ అవకాశాలు యివ్వాలి. తద్వారా వాటి సహజ ఎదుగుదల సామాజిక అనివార్యతగా గుర్తించి ఆయా సమస్యల్ని పరిష్కరించాలి. చట్టబద్ధ అవకాశాలుంటే ప్రజలు సాయుధులు కావాల్సిన అవసరం ఉండదు. కోస్తాంధ్రలో సాయుధ పోరాటాలు లేవు. అక్కడ సమస్యలు లేవా? అక్కడ ఉద్యమాలకు బహిరంగ అవకాశాలుండడం వల్ల సాయుధులై, రహస్యంగా తిరగాల్సిన అవసరం లేకపోయింది. దళిత బహుజన ఉద్యమాలు, రైతాంగ ఉద్యమాలు మాదిగ దండోరా ప్రజల్ని ఎంతో చక్కగా చైతన్యవంతం చేసి వేడి దిగగానే వాటి సహజ స్థితికి దిగిపోయాయి. నక్సలైటు ఉద్యమాలు కూడా ఎంతో ఉరుములతో కురిసినా నిలకడ వస్తే జడివానలా వచ్చి కాలం తీరి చలికాలం, వేసవి కాలం వస్తాయి. కొత్త ఉద్యమాలు వస్తాయి. నిర్బంధాలు ఎప్పటి మాత్రం అప్పుడు పోయనీయని అవస్థను సృష్టించడం వల్ల మనిషి తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరై తలతిక్క పెరిగిపోతుంది.

**గాంధీజీ, అంబేద్కర్ శాంతియుత పంథా విశిష్టత :**

సాయుధ పోరాటాల ద్వారానే మాత్రమే మార్పు వస్తుందనేది ఒక భ్రమ. లేదా ఒక విశ్వాసం. కోస్తాంధ్రలో గానీ భారత దేశ యితర మైదాన ప్రాంతాల్లో గానీ సమాజ సహజ గతితోనే అభివృద్ధి సాధ్యమైంది. సాయుధ పోరాటాలు నిత్యం వెనకబడి పోవడానికి గీటురాయి. వెనకబాటు చైతన్యంలో భాగంగానే వెనకబడిన ప్రాంతాల్లోనే దీనికి కాస్త ఆదరణ వుంది. అయినా పరిష్కారం ఆయుధాలు పట్టడం పట్టక పోవడంలో లేదు. కుల సమస్య, ఆకలి పేదరికం, అజ్ఞానం, అసమానతలు, స్వేచ్ఛా సమానత్వం, ఆత్మ గౌరవాల పరిష్కారంలో మౌలిక పరిష్కారం ఉంది. ఆయుధాలపై ఆధారపడడం అంటే రాజరిక వ్యవస్థలోకి వెనక్కి మళ్ళడమే. ఓటు హక్కు ప్రతి మనిషికి ఒకే విలువ ప్రతిపాదించింది. ఓటుహక్కు లేని సమాజాలను ఇప్పుడు ఊహించలేం. ఓటుహక్కు లేని సమాజం అంటే అర్థం రాజరికం, నియంతృత్వం తప్ప వేరు కాదు. ఓటు హక్కు బహిష్కరించడం ద్వారా రాజరిక కాలంనాటికి ప్రజల హక్కులను కుదించాలని నియంతృత్వం తప్ప, ప్రతి మనిషిని గౌరవించే ప్రజాస్వామ్యం అవసరం లేదని చెప్పడం. ఓట్ల బహిష్కరణ అనేది సైద్ధాంతికంగా సమాజాన్ని ఆటవిక సమాజంలోకి నడపడం. లేదా రాజరిక వ్యవస్థలోకి వెనక్కి మళ్ళించడం. తద్వారానే విజయం సాధించగలమనుకోవడం రాజరిక, ఆటవిక కాలంనాటి వ్యూహం, ఎత్తుగడలకు సంబంధించినవి.

**ఏదీ సిద్ధాంతాల గొప్పతనం కాదు :**

జ్ఞానం, సైన్సు, అభివృద్ధి, అధికారం, కుల గౌరవం, స్వేచ్ఛ, సమానత్వం, సంస్కృతి, సౌఖ్యాలు అందుకున్న వారికి, అవి అందుకోవాల్సిన వారికి మధ్యవుండే నిరంతర వైరుధ్యం, సమస్త సామాజిక చైతన్యాల్లో, ఉద్యమాల్లో, భావజాలాల్లో పూసల్లో దారంలా కొనసాగుతుంది. స్థలకాల నిర్దిష్ట స్థితి గతుల్లో అందిన చైతన్యాన్ని అనుసరించి రూపం తీసుకుంటుంది. సిద్ధాంతాలు స్వయం పోషకాలు కావు. ప్రజలు తమ అవసరాలకనువుగా అందిన సిద్ధాంతాలతో, చైతన్యంతో మమేకమవుతారు. అంతే తప్ప అది సిద్ధాంతాల గొప్పతనం కాదు.

చిన్న రాష్ట్రాల ఏర్పాటులో భాగంగా తెలంగాణా రాష్ట్రం ఏర్పడితే నక్సలైట్ల సమస్య యిట్లా ఉండదు. కోస్తాంధ్రలో నక్సలైట్ల సమస్య లేదు. ఎందుకు లేదో – అదే స్థితిని తెలంగాణాలో సాధించడం తెలంగాణా మేధావుల, రాజనీతిజ్ఞుల కర్తవ్యం. కోస్తాంధ్ర అభివృద్ధి పరిణామాల్ని తెలంగాణాలోనూ సాధిస్తే, ఇతర ప్రాంతాల్లోనూ సాధిస్తే నక్సలైట్ల సమస్య ఉండదు. అయితే సామాజిక సమస్యలుంటాయి. వాటి భావ జాలాలు, వ్యూహాలు, ఎత్తుగడలు యిదే మూసలో కొనసాగవు. అప్పటి రూపాల్ని ప్రజలు అప్పటికి ఏర్పరుచుకుంటారు. అందుకు సహకరించే ప్రభుత్వాల్నే ప్రజలు ఎన్నుకుంటారు.

(వార్త దినపత్రిక ఆగస్టు 2003)



# ప్రపంచీకరణ - తెలంగాణ

(రచయిత, పత్రికా సంపాదకులు కాసుల ప్రతాపరెడ్డి వ్రాసిన సాహిత్య వ్యాసాల సంపుటి "కొలుపు" పుస్తకానికి నేను రాసిన ముందుమాటలోని కొన్ని భాగాలు.)

**త్యాగం తెలంగాణ వారిది – భోగం మరికొందరిది :**

భాషా ప్రయుక్త రాష్ట్రాలకు దేశానికి ఆదర్శంగా, ప్రేరణగా నిలిచిన త్యాగం తెలంగాణ ప్రజలది. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం ద్వారా ఎదిగిన నాయకత్వంలో కోస్తావారి ఆధిపత్యం, వారి సైద్ధాంతిక వలసవాద తత్త్వం అంతర్లీనంగా ఉండడం వల్ల భోళాగా సరేనని విశాలాంధ్రకు సై అంటూ బోల్తాపడిన చరిత్ర తెలంగాణ విప్లవ ప్రజానీకానిది. బూర్గుల రామకృష్ణారావు నైజాం రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉండి భాషాప్రయుక్త రాష్ట్రాలకు అంగీకరిస్తూ తెలంగాణ ప్రత్యేక రాష్ట్రాన్ని సామంతరాజ్యంగా మార్చడానికి విశాలాంధ్రకు అనుకూలంగా తన పదవిని త్యాగం చేసి శిబి చక్రవర్తి. వామనుడి పాదం క్రింద నలిగిపోయిన అతని స్వార్థం, దాతృత్వం చరిత్రకు ఎక్కలేదు. అక్కడి నుంచి తెలంగాణ చరిత్ర, సాహిత్య చరిత్ర విశాలాంధ్రలో వలసవాదులకు అనువుగా అణచబడడం మొదలైంది. వామనుడి మూడోపాదంలా కాంగ్రెస్, తెలుగుదేశం, వామపక్షాల క్రింద తెలంగాణా చరిత్ర, సంస్కృతి మసిపూసి మారేడు కాయ చేయబడి వారి చేతిలో ఆటబంతి అయింది. ఎవరికి ఇష్టం వచ్చినట్లుగా వారు తెలంగాణ చరిత్రను వ్యాఖ్యానించారు. వ్యాఖ్యానాన్నే చరిత్రగా మన ముందుంచారు.

**రాజులందరూ నీతిపరులైనట్టు :**

లోకంలో ఇంకెవరూ అలాంటివారు లేనట్లు మిగతా రాజులందరూ చరిత్రలో మంచివారయినట్టు నిజాం రాజు ఫ్యూడల్ అని, నియంత అని కొందరు పనిగట్టుకొని ప్రచారం చేసి తెలంగాణలోని దొరలు, భూస్వాములు, పట్వారీలు చేసిన దౌర్జన్యాలన్నింటికి నిజామే కారణమన్నట్లుగా కోపాన్ని నిజాంపైకి మళ్లించి అసలు నేరస్తులు కాంగ్రెస్ టోపీలు ధరించి ప్రజానాయకుల రూపాల్లో ముందుకు వచ్చారు. ఇలా నాటి కమ్యూనిస్టులు, కాంగ్రెస్‌వారు ఒకేవిధంగా ప్రవర్తించారు.

**1921లోనే వెట్టిచాకిరీ నిర్మూలించిన నిజాం :**

నిజాం నవాబు 1921లోనే వెట్టి చాకిరిని నిర్మూలిస్తూ జీవో (ఫర్మానా) జారీ చేసాడని ఎందరికి తెలుసు? నిజాం రాజ్యం అఖండ భారతదేశంలోని 600 సంస్థానాల్లో ఒక సంస్థానం కాదు. అదొక స్వతంత్ర దేశం అని ఎందరికి తెలుసు?

అది ప్రపంచదేశాల్లో తన రాయబారులను నియమించుకునే దేశం అని ఎందరికి తెలుసు?

**సాయుధ పోరాటాలపట్ల నాటి నిజాం - నేటి పాలకులు ఎవరు గొప్ప?**

అతనిలో సంస్కరణాభిలాష కూడా కొంత వుండేదని ఎందరికి తెలుసు? ఉదాహరణకు ఇవాళ, నిన్న నక్సల్బరీలో సంథాల్‌లు, శ్రీకాకుళంలో గిరిజనులు, ఆదిలాబాద్, గడ్‌చిరోలీలో గోండులు తిరుగుబాట్లు చేస్తే వారి సమస్యలేమిటో పరిశీలించి పరిపాలన కోసం కమిషన్లు వేసారా? కానీ 1940లో కొమురం భీం తిరుగుబాటు చేసి చనిపోయినప్పుడు నిజాం రాజు ప్రపంచ ప్రఖ్యాత ఆంత్రోపాలజిస్టు హేమన్ డార్ఫ్‌ను పిలిపించి గోండు గిరిజనుల సమస్యలను అధ్యయనం చేసి పరిష్కారం కోసం సూచనలు చేయాలని కోరారు. ఇందులో ప్రజాస్వామ్య ప్రభుత్వాలు అణచివేతదారులా, నిజాం అణచివేతదారుడా? నిజాం రాజుకున్న పాటి ప్రజాస్వామికతత్త్వం 1967లో నక్సల్బరీని అణచివేసిన సిపిఎంకుగానీ, జ్యోతిబసుకు గానీ, 1969లో శ్రీకాకుళోద్యమాన్ని అణచివేసిన వెంగళరావుకుగానీ, కాంగ్రెస్‌కుగానీ ఆ తర్వాతి ప్రభుత్వాల ముఖ్యమంత్రులకు గానీ ఉందా అని బేరీజు వేసుకోవాల్సిన అవసరం ఉంది.

**దేశీయ వైద్యానికి ప్రోత్సాహం :**

నిజాం రాజు దేశీయ వైద్యాన్ని ఆదరించారు. అల్లోపతి వైద్య విధానాన్ని వ్యతిరేకించారు. జీవితం చివరికంటా దేశీయ వైద్యాన్నే తీసుకున్నారు. ప్రోత్సహించారు. చిన్న చిన్న రుగ్మతలకు లావో జిందా తిలస్మాత్ అని అడిగేవారని చెప్పుకుంటుంటారు.

**కులవృత్తులను ఆధునికీకరించే శిక్షణ :**

నిజాం రాజ్యం ఆధునిక పరిశ్రమల వల్ల దెబ్బతింటున్న కులవృత్తుల వారికి ఆయా కులవృత్తులకు అనుసంధానంగా ఆధునిక టెక్నాలజీ శిక్షణను ఏర్పాటు చేసింది. కులవృత్తి సంఘాలను రిజిష్టర్ చేసుకొని చేనేత మొదలైన వృత్తి కులాలకు సబ్సిడీపై నూలు, తదితర ముడిపదార్థాలను అందించే విధానాలను అమలు చేసింది. 1930ల్లో నిజాం రాజు మంత్రసానులకు బ్రిటీష్ తదితర దేశాలనుండి స్త్రీ వైద్య నిపుణులను పిలిపించి శిక్షణనిప్పించారు.

**వలసల నివారణకు పరిశ్రమల స్థాపన :**

బొంబాయి రాష్ట్రానికి వలస వెళ్లుతున్న చేనేత వృత్తిపనివారి వలసలను తగ్గించి వారికి స్థానికంగా ఉపాధి కలిగించడం కోసం నిజాం రాజ్యం అజాంజాహి వంటి మిల్లులను స్థాపించింది. ప్రముఖ సోషలిస్టు నాయకుడు బద్రీ విశాల్‌పిట్టి తండ్రి ఆధ్వర్యంలో బట్టల మిల్లును స్థాపింపజేయడం జరిగింది. స్టేట్ బ్యాంకును, నిజాం రైల్వేస్‌ను నెలకొల్పడం జరిగింది. మంచినీటి సరఫరా ఏర్పాట్లు చేయడం జరిగింది. మంచినీళ్లపై పన్ను వేసి వసూలు చేయడమా అంటూ అలా చేయడాన్ని చాలా



అవమానకరంగా ఫీలయ్యాడు. ఉచితంగా మంచినీటి సరఫరాను అందించారు వెూక్షగుండం విశ్వేశ్వరయ్య సేవలను ఉపయోగించుకొని పలు తాగునీటి, సాగునీటి ప్రాజెక్టులు నిర్మించారు.

**ప్రపంచంలోనే అత్యంత ధనవంతమైన రాజ్యం. సాలార్‌జంగ్ మ్యూజియం వంటి అపురూప సంపదను సేకరించారు. నిజాం స్టేట్ రైల్వేస్‌ను, సింగరేణి బొగ్గుగనులను, పారిశ్రామిక వాడలను నూటయాభైయేళ్ల క్రితం స్థాపించారు. నైజాం తెలుగుభాష మాట్లాడే ఎనిమిది జిల్లాలు తెలంగాణా ప్రాంతం. మరాఠీ మాట్లాడే ఐదు జిల్లాలు. కన్నడం మాట్లాడే మూడు జిల్లాలు. మొత్తం జిల్లాల సంఖ్య పదహారు.**

**భాషా ప్రాతిపదిక సిద్ధాంతాలు అసమగ్రమైనవి :**

భాషా ప్రాతిపదిక సిద్ధాంతాలు అసమగ్రమైనవి. భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటయిన తర్వాత రూపొందించిన భాషలవారీ సిద్ధాంతాలు, సూత్రీకరణలు, అధ్యయన పద్ధతులు, బహుభాషా రాష్ట్రాలకు, రాజ్యాలకు వర్తించవు. నైజాం దేశంలోని తెలంగాణ జీవితాలు ఉర్దూలో, హిందీలో, మరాఠీలో, కన్నడలో, బెంగాలీలో చిత్రించబడిన తీరుతెన్నులన్నింటినీ ఇప్పుడు వెలికి తీసుకురావాల్సిన అవసరం ఉంది.

**ఐదు భాషల దేశం తెలంగాణ :**

ఐదు భాషల రాజ్యం కావడం వల్ల నైజాం రాజ్యం నుంచి హైదరాబాద్ బడీచౌడీ కేంద్రంగా 'పంచదార' అనే త్రైమాసిక పత్రిక ఐదు భాషల సాహిత్యంతో వెలువడేది. ప్రేమ్‌చంద్ సమకాలికుడైన కిషన్‌చందర్ వ్రాసిన **'జబ్ ఖేత్ జాగే'** నవలకు జైత్రయాత్ర అనే పేరుతో తెలుగు అనువాదం వెలువడింది. నర్సింగరావు తీసిన మా భూమి సినిమాకు మూలకథను ఈ నవలే అందించింది. అలాగే మరాఠీలో వెలువడిన పలు నవలలు నిజామాబాద్, ఔరంగాబాద్ ప్రాంతాలకు చెందిన తెలంగాణ ప్రజల జీవితాలకు సంబంధించి ఉన్నాయి. 1948లో తమిళంలో వ్రాసిన 'జంటనగరాలు' అనే అశోక మిత్రన్ గారి నవల తెలంగాణ జీవితాలకు సంబంధించిందే. ప్రముఖ చిత్రకారుడు చిత్తరంజన్‌దాస్, ప్రఖ్యాత కవి హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ తెలంగాణ జీవితాల గురించి చిత్రించారు. ఉర్దూలో ఎంతగా చిత్రీకరణ పొందిందో ఇంకా వెలికి తీయవలసి ఉన్నది. ఇలా తెలంగాణ ప్రజల జీవితం సాహిత్యం తెలుగు పరిణామాల విశిష్టతను, వ్యాప్తిని తెలియజేస్తున్నది.

**ప్రపంచీకరణకు వ్యతిరేకంగా తెలంగాణ సంస్కృతి :**

'తెలంగాణ సాంస్కృతిక వేదిక' వారు జొన్నరొట్టె, వట్టిచాపల కూర భోజనంతో హైదరాబాద్ రెడ్డి హాస్టల్ ఆడిటోరియంలో సదస్సు నిర్వహించి, శాలువాలకు బదులు గొంగళ్లు కప్పి తెలంగాణ పెద్దలకు సన్మానం చేసి జానపద ప్రజల పక్షం వహించారు. ఆయా ప్రాంతాల, స్థానిక జాతుల ప్రత్యేక సంస్కృతిని, ఆచార వ్యవహారాలను, వైద్యవిధానాలను, జీవిత దృక్పథాలను, విధానాలను పరిరక్షించుకుంటూ పరిణతి

చెందించుకుంటూ ముందుకు సాగడం ద్వారానే గ్లోబలైజేషన్, ప్రైవేటైజేషన్, లిబరలైజేషన్ క్రమాలకు నిలువరించడం సాధ్యమవు తుందనే అంతర్జాతీయ దృక్పథాన్ని తెలంగాణ ఉద్యమం బలంగా ప్రతిపాదించింది.

**గ్లోబలైజేషన్‌కు వ్యతిరేకంగా గాలిలో కత్తులు దూసేవారు :**

గ్లోబలైజేషన్‌కు వ్యతిరేకంగా గాలిలో కత్తులు దూసినట్లుగా, జనాంతికంగా అరవడం ద్వారా చేయగలిగేదేమీ లేదు. ఆయా ప్రాంతాల నిర్దిష్ట సామాజిక ఉద్యమాలు, అస్తిత్వ పోరాటాలు అందుకు పరిష్కారం. ఈ విషయాన్ని మరుగుపరిచి కోస్తావాదులు, కమ్యూనిస్టులు ఇవాళ గ్లోబలైజేషన్‌కు వ్యతిరేకంగా కూడా తామే మాట్లాడుతున్నట్లు ప్రదర్శన గావిస్తున్నారు. తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటాల్లో ఒక భాగం.

**సోవియట్ యూనియన్ నుంచి నేర్చుకునేది ఏమీ లేదా?**

కానీ కొందరు ప్రపంచీకరణలో అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ భావజాలంలో భాగంగా వక్రీకరిస్తున్నారు. సోవియట్ యూనియన్‌గా 70 ఏళ్ళు ఒకే దేశంగా కలసివున్న తర్వాత కూడా ప్రజలు 13 దేశాలుగా 1985లో విడిపోయిన తూర్పు యూరోప్ పరిణామాల చరిత్ర మనముందున్నది. కమ్యూనిస్టులు ఈ పరిణామాల నుండి నేర్చుకోవడానికి సిద్ధంగా లేరు. ప్రపంచానికి నాయకత్వం వహించడం వదిలేసి వాళ్ళు కొద్దిమందిపై తమ కులపు, తమ ప్రాంతపు ఆధిక్యతను కొనసాగించడం ముందు అన్ని దిగదుడుపేనని నిరూపించుకుంటున్నారు. 1967 నుండి కొనసాగుతున్న తెలంగాణ రాష్ట్ర ఉద్యమం 1990 తర్వాత మొదలైన గ్లోబలైజేషన్, ప్రైవేటైజేషన్, లిబరలైజేషన్, అమెరికనైజేషన్‌లో భాగమని వారు వక్రీకరించడం హాస్యాస్పదం. సోవియట్ యూనియన్ 13 దేశాలుగా స్వాతంత్ర్యం పొందవచ్చు గానీ, తెలంగాణ ఒక రాష్ట్రంగా ఉండే హక్కు లేదా!

తెలంగాణ సాంస్కృతిక వేదిక, తెలంగాణ బహుజన సమాజం ముందుకు తెచ్చిన సైద్ధాంతిక చర్చ మార్క్సిజాన్ని అంబేద్కరిజాన్ని ప్రజాస్వామిక రాజ్యాంగ స్ఫూర్తిని ఫెమినిజాన్ని మానవతావాదాన్ని సమన్వయ పరిచి ప్రజాస్వామ్య పద్ధతుల్లో బహుళ పార్టీ వ్యవస్థలో సాధ్యమయ్యే తీరును ముందుకు తీసుకొని రావడం జరిగింది.

తెలంగాణ బహుజన సాహిత్యాన్ని వెనక్కి నెట్టి ఫెమినిస్టు వర్గవాద విప్లవవాద సాహిత్యాన్ని గ్లోబలైజేషన్ సాహిత్యాన్ని ప్రమోట్ చేస్తున్న పేరిట తమ స్వార్థపూరిత స్వప్రయోజనాలను కాపాడుకుంటున్నారు. ఇవాళ లిఖితబద్ధం కాని ఈ చరిత్రనంతా లిఖితబద్ధం చేయాల్సి ఉన్నది. చరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్రే అనేవాళ్లు కూడా చాలా కన్వీనియెంట్‌గా ఈ విషయాన్ని కప్పిపెడుతున్నారు.

ఒకే భాషలో వెలువడిన సాహిత్యమంతా ఒక్కటి కాదు. ఇంకా చెప్పాలంటే "ఒకే కాలంలో వెలువడిన తెలుగు సాహిత్యమంతా ఒకటి కాదు". ఒకే కులం పేరిట ఒకే వాదం పేరిట వెలువడిన సాహిత్యమంతా ఒకటి కాదని దానికి కూడా



**ఆర్థిక శాఖామంత్రి ప్రకటించిన 1337 ఫసలీ ఆదాయ వ్యయపట్టిక చాలా ఉత్సాహ కరంగా ఉంది. ఈ సంవత్సరం క్షామ నివారణ, అభివృద్ధి శాఖ నిధులకు నిలువయుంచు మొత్తంగా పోగా 44 లక్షలు నిలువ ఉంటుందని అంచనా వేయబడింది. మన రాష్ట్ర ఆర్థిక పరిస్థితులు చక్కబరిచి నిలువచూపు చున్న మన ఆర్థికశాఖ మంత్రి ఎంతో ప్రశంసనీయులు అని గోల్కొండ పత్రిక 8-10-1927 సంపాదకీయం పేర్కొంది.**

కులం వర్గం జాతి ప్రాంత పరిమితులు, ప్రత్యేకతలు అభివృద్ధి చెందిన ప్రాంతాల అణచివేతలు స్వవర్గంలో, స్వకులంలో స్వజాతిలో ప్రాంతాల వారీగా పీఠాధిపత్యాల వారీగా కొనసాగుతుంటాయని తెలుగు సాహిత్య చరిత్ర స్పష్టం చేస్తున్నది. "కోస్తా ఆంధ్రులకు జీవితంలో పైమెట్టు అధిరోహించడానికి దళిత, స్త్రీవాదాలు సాధనాలుగా మారాయి. కెరీరిజంతో పైకెదగడానికి సోపానాలయ్యాయి. కానీ అవే సిద్ధాంతాలు తెలంగాణలో మొత్తం సమాజ విముక్తి కోసం పనికి రావాలని కోరేవారి చేతుల్లో కొనసాగుతున్నాయి."

అందువల్ల కమిట్‌మెంట్ చర్చతో పాటు నిమగ్నత చర్చ కూడా తెలుగు సాహిత్యంలోని దళితవాదంలో, స్త్రీవాదంలో, అభ్యుదయ విప్లవవాదాల్లో ఇప్పటికీ నిర్ణయకాంశమే. నిజానికి మాటలకు, చేతలకు మధ్య ఉండే వైరుధ్యాన్ని పరిష్కరించే రచయితలే చెప్పింది చేసే రచయితలే నిజాయితీ గలవాళ్లు అనేది చరిత్ర చెప్పిన సత్యం. కానీ తెలుగు సాహిత్యం, సాహిత్య విమర్శ దీనికి పూర్తిగా భిన్నంగా కొనసాగుతున్నాయి.

**బ్రిటీషాంధ్ర శివారెడ్డి – తెలంగాణ వరవరరావు :**

శివారెడ్డి ఏ విప్లవ భావజాలానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాడో దానికి గుర్తింపు ఇవ్వాల్సి వస్తే వరవరరావు అందుకు ప్రతినిధి అవుతాడు తప్ప బ్రిటీషాంధ్ర శివారెడ్డి కాదు. కానీ వరవరరావు స్థానాన్ని శివారెడ్డితో పూరించిన సాహిత్య చరిత్ర మన కళ్ల ముందున్నది. ఇట్లా వచన కవిత్వంలో మొదలైన స్థానభ్రంశం (సబ్లేషన్) తెలంగాణ దళితవాద సాహిత్యంలో, తెలంగాణ ఫెమినిస్టు సాహిత్యంలో, తెలంగాణ సామాజికవాద సాహిత్యంలో కూడా కొనసాగుతూ వస్తున్నది. మార్క్సిజం యొక్క వ్యూహం ఎత్తుగడలు వేరు. అంబేద్కరిజం యొక్క వ్యూహం, ఎత్తుగడలు వేరు. అంబేద్కరిజం ప్రపంచాన్ని అర్థం చేసుకునే తీరు వేరు. మార్క్సిజాన్ని అర్థం చేసుకున్న తీరు వేరు.

ఇవాళ తెలంగాణ సామాజికోద్యమాలు, తాత్త్విక భావజాల ఉద్యమాల ద్వారా ప్రపంచ పరిణామానికి తనవంతు నాయకత్వం అందిస్తూ ముందుకు సాగుతున్నది. తెలంగాణ సమాజాన్ని సొంతం చేసుకున్న వ్యక్తిత్వంతో, సమగ్ర ప్రాపంచిక దృక్పథంతో ప్రపంచాన్ని వీక్షించే స్థాయికి విశ్వమానవాళి శ్రేయస్సు కోరే స్థాయికి యువతరం ఎదగాల్సి ఉంది. అందుకు తెలంగాణలో రెండు దశాబ్దాలుగా ఎదిగిన భావజాలాలను, ఉద్యమాలను లోతుగా అధ్యయనం చేయడం అవసరం.